# కాశీపతి చమత్కృతి



కృతికర్త

మహాకవిశేఖర, చిత్రకవిసార్వభౌమ, కవిసింహ.

బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులు

కృతిభర్త

"రసప్రియ"

శ్రీరంగాపురం పోతేదార్ కేశవాచార్యులు

ప్రథమ ముద్రణ : జనవరి, 1998

ప్రతులు : 500



ముఖచిత్రము : ఎం. వెంకటాచారి, B. Tech.,

వెల : రు 40-00

ప్రతులకు :

F. కేశవాచార్య (రసప్రియ)
(రి) ఛీఫ్ ప్లానింగు ఆఫీసరు
ఇ.నెం. 6-2-23/A
తుమ్మలగడ్డ బజార్
ఖమ్మం - 507 001.



భోజ ప్రచురణలు : 11

ముద్రణ :
నటరాజ్ ప్రింటర్స్, ఖమ్మం

"SAHITYA BRAHMA"
Dr. V.V.L. Narasimha Rao
Poet, Play-Wright, Actor & Director

C4, Huda Colony,
Saroor Nagar,
HYDERABAD - 500 035

# రసప్రియ గర్జా చమత్కృతి

'కాశీపతి చమత్కృతి' యను ఈ కృతి చిరకాల ప్రసిద్ధమైన చతుర్విధ కవితా సరస్వతికి ప్రత్యక్షరూపము, చతుర్విధ కవితలనగా ఆశు చిత్ర బంధ గర్భ కవితలు. ఆధునిక పద్య కవులలో సైతము వీని యందాసక్తి గలవారు కొందఱు మాత్రమే. ఈ కొందఱిలో అవధాన కవులు అగ్రగణ్యులు, వారికి కూడ ఆశుకవితతో గల అవశ్యకము తక్కిన కవితలతో కలుగదు.

మహా మేధాసంపన్నుడును, చతుర్విధ కవితాధురీణుడును, మీదు మిక్కిలి 'కవిసింహ' బిరుదాంచితుడును అగు బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధాని తన కృతులలో చూపిన చతుర్విధ కవితా చమత్కృతులను సంక్షిప్తరూపమున - నిండ తొంబది పుటలులేని ఈ లఘుగ్రంథమున నిక్షేపించెను. గద్వాలాద్యనేక సాహితీ సభాక్షేత్రములలో ఉద్దండ కవిసింహమై గర్జించిన కాశీపతి కవితా చమత్కృతులను పొదువుకొన్న ఈ చిన్నిగ్రంథము కవి గతించిన పిమ్మట ఇప్పుడు ముద్రితమగుట ప్రస్తుతాంధ్ర రసజ్ఞ పండితుల అదృష్ట విశేషము.

ఈ అదృష్ట మిందఱికి పంచి యిచ్చుచున్న పుణ్యశీలుడు, కవివతంసుడు, 'రసప్రియ' మనోజ్ఞ బిరుదాంచితుడు, బ్రహ్మశ్రీ పోతేదార్ కేశవాచార్యుడు. చిత్రలేఖన తత్త్వశాస్త్ర చరిత్రపరిశోధనాభిరుచులను పుష్కలముగా పండించుకొని, క్షేత్ర చారిత్రక సాంస్కృతిక రచనలు పెక్కింటిని వెలయించి ప్రాజ్ఞుల మెప్పుగొన్న మనీషి. సాంఖికార్థిక ప్రణాళికా గణాంక సమీక్షలుద్యోగ ధర్మముగా నిర్వహించి, ప్రశంస

లందుకొన్న ప్రజ్ఞాశాలి. రామకథామధురగేయమాలాలంకృతమైన భవ్య 'పర్ణశాల' కాహ్వానించి రసజ్ఞకోటుల సేద తీర్చిన రసప్రియ వతంసుడు.

కవిసింహుడైన కాశీపతియే రసప్రియుడైన ఈ సత్కవికి తన యీ కావ్యమును హార్దికముగా అంకితమొనర్చెను.

"ఏర్చి తగు పద్యములు కూర్చి, తీర్చిదిద్ది
తెలియ 'కాశీపతి చమత్కృతి' యను పేర
కేశవాచారి కీ ఖండకృతి నొసగితి" **నని కవిసింహుడే**

గ్రంథావతారికలో కృతిపతిని ప్రస్తుతించెను. అందాక వచ్చినచో కృతి పతికి 'రసప్రియ' బిరుదమిచ్చి అంతకుముందే సముచిత సత్కార మొనర్చిన ఉచితజ్ఞుడు కాశీపతి కవిసింహుడే.

గ్రంథనామము "కాశీపతి చమత్కృతి". గ్రంథమున కీపేరు పెట్టుట యందే కవిగారి దూరదృష్టి స్పష్టమగుచున్నది.

ఔను; చమత్కృతి లేక కృతి కృతియనిపించుకొనునా? "చమత్కార వత్త్వం కావ్యత్వమ్" అనునది ఆలంకారిక సమ్మతమైన సార్థకసూక్తి. లోకోత్తరాహ్లాదమునకే చమత్కారమని నామాంతరము గదా! చర్వణ సహమైన కావ్యార్థ సంభావన చేతనే కదా లోకోత్తరాహ్లాదము సిద్ధించు నది? అట్టి అర్థమే కదా రమణీయార్థమగునది!

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అని పండిత రాయలు ప్రవచించుటలో పరమార్థ మిదియే గదా!

క్షేమేంద్రుని ఔచిత్యమునకును ఆత్మభూతమైనది ఒక విధముగా చమత్కారమే. రసమునకు జీవితభూతమైన ఔచిత్యము చారుచర్వణ సహమైన చమత్కారము వలననే సిద్ధించుచున్నది.

"ఔచిత్యస్య చమత్కారకారిణః చారుచర్వణే
రస జీవిత భూతస్య విచారం కురుతేఽధునా...."

అను ఔచిత్య విచార చర్చా పరమార్థము చమత్కారమునందే పర్య వసించుచున్నది. లోకోత్తరాహ్లాద జనకమైన ఈ చమత్కారమునకు కాశీపతి కవి పట్టాభిషేకము చేసి ఈ లఘుకృతిని దిద్దితీర్చెను.

ప్రతి పద్య చమత్కారము కలుగ చెప్పెదనన్న చేమకూర వెంకట కవి వలె, 'ముకుంద విలాస' కర్త కాణాదము పెద్దన కవివలె ఇంకను ముక్కు తిమ్మనవలె, రామరాజభూషణుని వలె— కాశీపతి చిత్ర విచిత్ర కవితా చమత్కృతులను తనవైన వివిధ కృతులనుండి ఉద్ధరించిచూపెను.

ఈ మహోద్ధారములకొక విధముగా రసప్రియుడైన కేశవా చార్యుడే కారణభూతుడు. ఏమి యెఱుగనట్లు ఈయన కవిసింహుని ప్రశ్నించుట, అప్యాయముగా ఆ కవిసింహుడు సమాధానించుట - ఈ విధముగా పరమ కవితా చమత్కృతి నిక్షేపములు ఈ చిన్ని పుస్తకమున ప్రోవుపడినవి. ఈ కారణము చేతనే ఈ గ్రంథ మమూల్యమై భాసించు చున్నది.

ఏకాక్షరి, ఏకపాది, అపంచ వర్గీయ, ఓష్ఠ్య-అచల జిహ్వాక, పాద భ్రమక, పద్యభ్రమక, శుద్ధనిరోష్ఠ్య సర్వేకార, సర్వోకారాది చిత్రాతిచిత్ర కవితలు, గర్భబంధాది కవితలు చోటు చేసికొని, చతుర్విధ కవితా విశ్వరూప సాక్షాత్కారము ప్రసాదించుచున్న 'కాశీపతి చమత్కృతి' నత్యంత మభినందించుచున్నాను. ఏతద్గ్రంథావతారమునకు హేతుభూతు డైన తత్కృతిపతి - రసప్రియ కేశవాచార్యు నంతకంటె హార్దికముగా అభినందించుచున్నాను.

అస్మదాదులు అంతకంటె చేయగలదేముండును? చేయవలసిన దేముండును?

హైదరాబాద్
12-12-97

— వాసిలి వేంకట లక్ష్మీ నరసింహారావు

శ్రీ మత్పరబ్రహ్మణే నమః

"విశ్వకర్మ సాహిత్యరత్న-ఆంధ్ర కవితావిశారద"
అలంపురి బ్రహ్మానందం, M.A.,B.Ed.,
రిటైర్డు ఆంధ్రోపన్యాసకులు

# ప్రవేశిక

ఇది "చమత్కృతి" యను పేర శ్రీ కవిసింహ పోకూరి కాశీపత్యవధానుల వారిచే రచితమైన చమత్కార భరిత పద్యకావ్యము. ఈ కవివర్యులు—

"ఇందుఁ గలడందు లేడను
సందేహము వలదు కవి విశారదు డెందున్
ముందంజ వేసి చూపును
కందని శశి కాశిపతి యఖండుం డవనిన్"

అను పద్యమునందలి ప్రతి అక్షర భావము అఖండ పాండితీ మండలాఖండలుండైన కవిసింహగారి యెడ నిండుగా సమన్వయించుననుటకు సందేహము లేదు. వీరికి పద్యరచనమునందేగాక కవిత్వ రంగము నందలి వివిధ ప్రక్రియలలో అనుపమాన ప్రతిభ కలదని పై పద్యభావము.

వీరు, ప్రబంధ రచనలలో శ్రీనాథ-శ్రీకృష్ణదేవరాయ-భట్టుమూర్తి-రుద్రకవ్యాదులవంటి ప్రౌఢుల మార్గమున, నడచినట్లు వీరి రచనల వలన మనమూహింపగలము. అంతియేకాదు కూచిమంచి తిమ్మకవి, ఎలకూచి బాలసరస్వతివంటి చిత్ర కవితాధురంధరులు కూడ వీరికి అభిమాన పాత్రులు. పూర్వమెప్పుడో ఒకప్పుడు రచింపబడి యుండెననెడి, ఎలకూచి బాల సరస్వతి విరచితత్ర్యర్థి కావ్యమిపుడదృశ్యమైనదని పలువురు తలంచెడి ప్రక్రియకు, నూతనముగా నొక త్ర్యర్థి కావ్యము రచించి ప్రాణము పోసినారీ కవివరేణ్యులు. అదియే "సారంగధరీయము". ఇందు శివపార్వతులయు, తారాచంద్రులయు, మరియు రాజనరేంద్రుని కుమారుడైన సారంగధరునిదియునగు విభిన్న గాథలు ఇతివృత్తముగా స్వీకరించి త్రివేణిగానల్లి శారదాదేవికి నొక శిరోభూషణముగా నలంకరించినారు.

పై పద్యమునందలి - ఎందున్ ముందంజ వేసి చూపు - ననుటకు వీరి "నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానము" అనునది అచ్చ తెనుగుల పరాక ఉద్గ్రంథము. ఇది నిరోష్ఠ్యము. అనగా నిందు 'ప' వర్గాక్షరము న మొత్తమునేగాక, కొందఱిచే నిరోష్ఠ్యముగా భావింపబడు 'వ' కారము అంతస్థ ములో లెక్కింపబడినను, కించి దోష్ఠ చలనముచే నుచ్చరింప బడునదగుటచే దానిని సైతము వదలి కవివరేణ్యులు 470కి పై చిలుకుతో మూడాశ్వాసముల గ్రంథము రచించినారు. ఈ గ్రంథమే వీరికి 'కవిసింహ' బిరుదముతో నలంక రింపజేసినది.

ఇట్లనేక కయితలను తమ కలము నుండి జాలువార చేసిన మహామనీషి కాశీపత్యవధానులు. లోకమునందిదివరకెందునను ఏ భాషలోను లేని వినూత్న కవితా ప్రక్రియనొకదానిని ఆంధ్ర వాఙ్మయమునకు మణిభూషణముగా "శౌరి శైశవలీల" యను నొక విచిత్ర కావ్యము విరచించి కవి పండిత ప్రకాండులలో నిట్టి రచనకు ప్రథమ స్రష్టయైనాడనిన నతిశయోక్తి కాదు. ఈ శౌరి శైశవ లీల లో నక్షర (వర్ణ) మాల యందలి పంచవర్ణాక్షరముల నన్నింటిని త్యజించి కేవలము అంతస్థోష్మములనబడు "య-ర-ల-వ-శ-ష-స-హ-ళ-అ"లగు దశాక్ష రములు మాత్రమే గ్రహించి శ్రీ కృష్ణుని లీలలు వర్ణింపబడినవి. దశాక్షర నిర్ణీ తాంత-స్థోష్మనియమముతో నింతవరకే భాషయందును కావ్యము వెలువడలేదని సహృదయులు ప్రశంసింపకనుండరు. కేవలము దశాక్షరములతో రచింపబడిన ఇద్దానిని అపంచ వర్గీయమని లేదా దశాక్షరీయమని శ్రీ కాశీపతిగారే వ్యవహ రించినారు.

ఇట్లీ కవిసింహగారు చిత్ర విచిత్ర చమత్కార భరిత గ్రంథమే గాక చిన్న చిన్న గీత పద్యములలో సైతము బహుళార్థము లొసగునవియే గాక "త్రింశదర్థ పద్యము" అనియొక చిన్ని గీతమును ప్రత్యేకముగా రచించి ప్రకటించినారు. అది నిస్సందేహముగా అపూర్వమని ఘంటాపథముగా చెప్పనగును. ఈ పద్యమున ముప్పదుగురు దేవతలు స్మరింపబడినారు. ఇట్టి కవిత రచించుట నభూతో నభవిష్యతి యనిన సత్యదూరముకాదు. కాన వీరెందైనను ముందంజ వేయువారనుట కుపేక్ష యుండునా!

ఉదాహృత విషయ రచనాదుల దృష్ట్యా, ఈ చమత్కృతి యందలి వివిధ కవితల దృష్ట్యా శ్రీ కాశీపత్యవధానులు చతుర్విధ కవిత్వములైన ఆశు-చిత్ర-గర్భ-బంధములలో ప్రతిభావంతులనుటకు సందేహము లేదు. తినబోవుచు రుచి చూచుట ఏల? ప్రత్యక్షముగా నీ చమత్కృతిలో గల చతుర్విధ కవితామృతము నాస్వాదింతురు గాక.

వాస్తవముగా నీ గ్రంథమునందలి కవితా చమత్కృతిలో, రసభావ చమత్కృతిలో నవగాహన చేసి అందలి రసమును గ్రోలి ఈ వాక్యములు వ్రాయ గడంగితినే గాని అన్యముకాదని మనవి చేయుచున్నాను.

కవిసింహ కాశీపత్యవధానులు, ఇందలి చమత్కృతులను గూర్చి, తమ శిష్యుడును, మిత్రుడును మరియు నాత్మీయుడునగు రసప్రియాంకిత (ఈ బిరుదము అవధానిగారి ప్రసాదితము) శ్రీ ఘోతేదారు కేశవాచార్యులడుగు ప్రశ్నల కను గుణ్యముగా, తమ కృతులనుండి క్రోడీకరించి అతనికే అంకితమిడుట ఆ శిష్యుని పుణ్యఫలమే యనదగును. ఈ సందర్భమున శ్రీ పోతనామాత్య కవివరుడు వచించిన "లలిత రసాల పల్లవఖాదియైచొక్కు కోయిల సేరునే కుటజములకు" అనువాక్యము జ్ఞప్తికి వచ్చుచున్నది. శ్రీ కవిసింహగారు శిష్యుడైన కేశవాచార్యుని జేరి అతనికే అంకితమిడి తృప్తినందుట కవిగారి శిష్యవాత్సల్య వైశాల్యమేగాక వారి విచక్షణా హృదయ గాంభీర్యమునకు తార్కాణము.

ఇంతకు పూర్వము "కవిసింహ కాశీపతి సంక్షిప్త సాహిత్య చరిత్ర"మను నొక పద్యగ్రంథము నాచే రచింపబడిన కారణమున గానోపు ఈ చమత్కృతి యొక్క వ్రాతప్రతిని తెచ్చి అందెటనైన లిపి దోషములుండిన యెడల పరిచూ చుటకు శ్రీ ఘోతేదారుగారు ఇచ్చినారు. ఆ వ్రాతప్రతిలో కొంతభాగము కవివర్యుల స్వహస్త లిపియు, మరికొంత భాగము వ్రాయసకాండ్ర వ్రాతయున్న దానిని పరిచూచు నవకాశము కల్గించినారు. ఇంత గొప్ప వారి కృతిలో నా వంటి వాడు పరిచూచుట యన దివాకరునకు దివ్వె చూపినట్లేకదా! అయినను అవధాని గారి రస-భావ-చమత్కృతులును గాంచి ఆనందమొందగల భాగ్యమని ఆ మూలాగ్రము చూచి ఎంతయో ఆనందించితిని. అది నా సౌభాగ్యము.

ఈ "చమత్కృతి" కృతికర్తగారి కనేక జోహారులర్పించుచు కృతి భర్త గారి కాశంసన ధన్యములతో నిట్లు శుభాకాంక్షలు పలుకుచున్నాను.

సీ॥ కొడుకు నేపడతి నట్టడవుల కంపించె ........ (కైకేయి)
నర్థంబు లెందున నరయ గలము ........ (కోశము)
అల దిగంబరుని నేయమ్మ సాముసు జేసె ........ (భవాని)
సొగసున కెయ్యది సొబగు నిచ్చు ........ (కవాళి)
వివిధ పురాణాలు వివరించు నెయ్యది ........ (చరిత్ర)
తనరు నుత్తరములఁ ద్ర్యక్షరములు
నాద్యంతములు విడనలరెడు హరి సమా
ఖ్యునకు విశ్వగురుండు కోర్కిమీఱ

గీ॥ ధనము ధాన్యంబు వస్తు వాహనములు మరి
ఘన మనమ్మును కీర్తియు గౌరవమ్ము
నొసగు గాతని కాంక్షించె నసమ ప్రీతి
నంది అలంపు రీబ్రహ్మానందు డెలమి॥

హైద్రాబాద్
తేది 11-6-1994

ఇట్లు
ఆలంపురి బ్రహ్మానందం

ఆచార్య ఎస్వీ రామారావు,
తెలుగు విభాగము
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అభినందన

ఆశుకవితా ధురీణులుగా, చిత్ర కవితా విశారదులుగా ప్రశస్తి గడించారు కీ.శే. పోకూరి కాశీపతి అవధానిగారు. గద్వాల మున్నగు ఆస్థానాలలో తమ కవిత్వ చాతుర్యమును ప్రదర్శించి 'కవిసింహ' బిరుదును, అనేక సత్కారాలను పొందినారు. సారంగధరీయము, హరిశ్చంద్రోపాఖ్యానము, శౌరిశైశవలీల మొ॥ కృతులు వారి కవితా వైదుష్యమునకు నికషోపలములు.

'సారంగధరీయము' సారంగధరుని కథతోపాటు, పార్వతీపరమేశ్వరుల- తారాచంద్రుల వృత్తములను ఇముడ్చుకొన్న త్ర్యర్థి (మూడర్థాల) కావ్యం. 'హరిశ్చంద్రోపాఖ్యానము' నిర్వచన నిరోష్ఠ్యముగా అచ్చ తెనుగులో కూర్చ బడిన కబ్బము. ఇక ఆంధ్ర వాఙ్మయంలో అపూర్వ ప్రక్రియగా పేర్కొనదగి నది 'శౌరిశైశవలీల'. శ్రీకృష్ణుని బాల్య క్రీడలను కేవలం అంతస్థ ఊష్మముల (య ర ల వ శ ష స హ ళ ఱ) పరిమితిలో మాత్రమే చిత్రించిన దశాక్షరీయ కావ్యం. అంతటితో ఆగకుండా ముప్పయిమంది దేవతలను స్తుతిస్తూ 'త్రింశదర్థ పద్యము'ను వెలువరించిన విద్వత్కవులు కాశీపతిగారు.

వివిధ రీతులలో, విభిన్న గతులలో పోకూరి వారు ప్రదర్శించిన కవితా చమత్కృతికి దర్పణం ప్రస్తుత కావ్యం. వారికి అనుగు మిత్రులు, ఆత్మీయులు అయిన ఫోతేదార్ కేశవాచారిగారు అడిగిన ప్రశ్నలకు సమాధాన రూపంగా వెలసిన ఈ కావ్యం వినూత్న ప్రక్రియగా పేర్కొనదగింది. ఆధునికమైన గోష్ఠి పద్ధతిలో (Interview) సంప్రదాయ కవితారీతులను పరిచయం చేయటం 'క్రొత్త పాతల మేలి కలయిక'గా భాసిస్తున్నది. కేశవాచారిగారు స్వయంగా రసజ్ఞులైన కవులు కావటం వల్ల కాశీపతిగారి పాండితీ గరిమను సహృదయ హృదయైక వేద్యం కావించారు. ఈ సంకల్పానికి వారిని నేను మనసారా అభినందిస్తున్నాను.

'రసప్రియ' బిరుద ప్రదానంతో కాశీపతిగారు మెచ్చిన సుకవులు కేశవాచారిగారు. అనేక శతకాలను, గేయకృతులను వెలువరించి కీర్తిశేషులు రామసుబ్బరాట్కవి, దివాకర్ల వేంకటావధాని, దాశరథి మరియు శ్రీ గడియారం రామకృష్ణ శర్మ, శ్రీ సి. నారాయణరెడ్డి ప్రభృతి పండితుల, కవుల అభినందనాశీస్సులు పొందినారు రామాయణ గాథను రసరమ్యముగా మలచిన గేయ కావ్యాలు 'పర్ణశాల', 'సీతాన్వేషణ', 'సుందరకాండ' పలువురి మన్ననలు అందుకొన్నాయి. క్యాసెట్టు రూపంలో కూడా వెలువడి రసజ్ఞులను అలరించాయి.

వృత్తిరీత్యా గణాంకశాఖలో గడితేరి ఉద్యోగవిరమణ దశలో ఖమ్మంలో స్థిర నివాసం ఏర్పరుచుకొన్న శ్రీ కేశవాచారి జన్మభూమి ఎందరో పండిత ప్రకాండులకు ఆకరమైన పాలమూరు జిల్లాలోని శ్రీరంగాపురం. అందుకే బాల్యంనుంచే ఆయనకు కవితా కళ అలవడింది. గద్వాల, వనపర్తి, జటప్రోలు, ఆత్మకూరు మున్నగు సంస్థానాలలో ఆనాడు కొనసాగిన సాహితీకృషిని స్వయంగా చవిచూసిన సాహితీప్రియులు ఆయన. గద్వాల సంస్థానాన్ని సందర్శించి సత్కారాలు పొందిన కాశీపత్యవధానిగారితో సాన్నిహిత్యం ఏర్పడటం ఆయన సుకృతం. తమఅనుబంధానికి చిహ్నంగా ఈ 'కవితా చమత్కృతి'ని కేశవాచారికి కృతినివ్వటం కాశీపతిగారి సౌహార్ద విశేషం. అవధానిగారు దివంగతులైనా వారిపై అభిమానాన్ని విడనాడక 'తీపి గుర్తు'గా ఈ కృతిని వెలుగులోనికి తెస్తున్నందుకు కేశవాచారిగారు అభినందనీయులు.

నేను కళాశాల విద్యార్థిగావున్న రోజుల్లో మిత్రులు కేశవాచారి ద్వారా కాశీపతిగారు నాకు పరిచయమైనారు. ఆ సందర్భంలోనే వారిని మా కళాశాలకు ఆహ్వానించి ఆశుకవితా ప్రదర్శనం ఏర్పాటు చేయటం జరిగింది. మళ్లీ ఈనాడు ఈ అభినందన ద్వారా వారిని స్మరించుకొనే అవకాశం కలిగినందుకు ఆనందిస్తున్నాను.

సికింద్రాబాద్
తేది 8-3-1995

ఇట్లు
డా॥ ఎస్వీ రామారావు

కపిలవాయి లింగమూర్తి
రిటైర్డు ఆంధ్రోపన్యాసకులు
'వాణీసదనం' విజయనగర కాలనీ, నాగరకర్నూలు.

# కాశీపతిగారి కళాప్రతిభలు

కం॥ సర్వజ్ఞ నామధేయము - శర్వునకే కాక సింగజనపాలునకే-
యుర్విన్ జెల్లును - అని శ్రీనాథుని ఉవాచ -

పేరును బట్టి కాశీపతిగారిలో ఆ సర్వజ్ఞాంశ వుంది. కాబట్టి పైపద్యంలో సింగభూపాలుని స్థానంలో మనం కాశీపతిగారిని కవితా విషయంలో చేర్చవచ్చు.

ఈ కవివర్యుడు విశ్వకర్మ వంశమున జనించిన త్వష్ట చిత్ర కవితాస్రష్ట. పల్నాటి నివాసియైన ఈ కవివర్యుని కవితా కామినికి పాలమూరు విహారరంగము కావటం ఈ జిల్లాయొక్క అదృష్టమే. ఎందుకనగా చిత్రకవిత మొదటిసారిగా ఈ జిల్లాలోనే పల్యాల గుండయ శాసనంలో కనిపిస్తుంది. తర్వాత ఆ రంగంలో యిక యెందరో యెన్నో ప్రయోగాలు చేసినారు.

కాశీపతిగారు చిత్రకవితా రంగంలో చేసిన ప్రయోగాలన్ని అంతవరకే సాహిత్యరంగంలో లేకపోలేదు అవన్ని ఒక గద్వాల సంస్థానంలోనే ఆయా కవుల ముఖంగా మళ్ళి తలసూపినవి. అటువంటి శబ్ద చిత్రాలన్ని ఎక్కడెక్కడున్నవి యేరి వాటన్నిటిని ఏకసూత్రంలో ఒకచోట రాశి పోయటంలో మనకు కాశీపతిగారి కళాప్రతిభ ద్యోతకమౌతుంది.

అప్పకవి ఆనాటికి వచ్చిన లక్షణశాస్త్రాలలో పాఠకునికి తన పుస్తకం చదివితె మరొకటి చదువనవసరం లేదంటాడు. అలాగే చిత్రకవితా రంగంలో గద్వాల సంస్థాన కాలంవరకు వచ్చిన సాహిత్యంలో ఒక్క కాశీపతిగారి కృతులు చదివితే చాలు. ఇక తక్కినవి గాలించనవసరముండదు.

లాక్షణికులు కవిత్వాన్ని ఆశువు-గర్భ-బంధ-చిత్రకవిత్వాలని నాలుగు విధాలుగా వింగడించినారు కాని గర్భబంధ కవిత్వాలు రెండు చిత్రకవిత్వంలోనే ఒదిగిపోతవి.

ఆశువులో మళ్లి. మధుర-విస్తర. వస్తు కవిత్వాలని చిత్ర కవిత్వంలో ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర పద్యాలు, గుణింతం పద్యాలు అనగా అచ్చంగా తలకట్లు, దీర్ఘాలు, గుడులు, కొమ్ములలో రచించేవి, అవేకాక క కా రాదుల ఏదోనొక అక్షరం గ్రహించి.... దాని గుణింతంలోనే రచించేవి స్థాననియమాన్ను సరించి నిష్కంఠ్య, కంఠ్య, నిర్మూర్ధన్య, మూర్ధన్య, నిస్తాలవ్య, తాలవ్య, నిర్దంత్య, దంత్య, నిరోష్ఠ్య, ఓష్ఠ్య, నిరనునాసిక, అనునాసికాదులు, పాదభ్రమక పద్యభ్రమక, అనులోమ విలోమాదులు,ఇచ్ఛావాక్య సంఘటన - దత్తపదులు - పదగోపన పాదగోపనలు, బిందుచ్యుతక మాత్రాచ్యుతకాదులని మొదలైన భేదాలున్నవి.

ఇటువంటివన్నీ కవులు సాహిత్యరంగంలో భాషలో చేసే సాము గరిడీలే గాని సరస విన్యాసాలు గావని లాక్షణిక మతం అయితే సరస కవిత్వాన్ని ఆహా అనేఅట్లు సాముకవిత్వాన్ని ఓహో అనే అట్లు నిర్వహించటంగూడ సామాన్య మైన పనికాదు. ప్రతిభ ఆ రెండింటికి సమానంగానే అవసరంకాగా చిత్రకవిత్వ ములో శబ్ద చిత్రాన్ని ఆలోచించి కవిత్వంలో పొదగటం ఒకయెత్తు మళ్లీ దాన్ని సందర్భాన్ని పొసగించి అర్థాంతరన్యాసంలోనో లోకోక్తి లోనో సమర్థించటం ఒక యెత్తు చిత్రకవిత్వానికిటువంటి పొసగింపు లేనప్పుడది కవిగారికి శ్రమనే తప్ప పాఠకునికి స్పందన యుండదు అందువల్ల సామాన్య కవికంటే చిత్ర కవిపై అదనంగా మరోబరువు ఎక్కువగా ఉంటుంది.

చిత్ర కవితా రచనలు సంస్కృతంలోకూడా లేకపోలేదు. సంస్కృతంలో రామకృష్ణ రూపనారాయణీయం అనే ఒక అనులోమ విలోమ కావ్యం. లక్ష్మణుడు శూర్పణఖ ముక్కుకోసినాడు కనుక ఆమె రావణునికి చెప్పినట్లుగా ఒక నిరనునాసిక రామకథ ఉన్నదట దండి దశకుమార చరిత్రలో ప్రియురాలి పలుగంటులు సోకిన పెదవులుగల మంత్రగుప్తుడను రాకుమారునితో నిరోష్ఠ్య వచనం చెప్పించినాడు. భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానాన్ని ధర్మజునికి మార్కండేయునితో రెండు కథలు విడివిడిగా చెబితే తనకనుష్ఠానానికి వేళ మీరి పోతుందని ఏక వాక్యంలో చెప్పించినాడు. ఇట్లా కవి తానెన్నుకొన్న ప్రక్రియకు తగిన ఔచిత్యం కూర్చుకోవటం కూడ చిత్రకవిత కవసరం.

నిరోష్ఠ్యం తెలుగులో ఇపుడొక ప్రత్యేక శాఖగా ప్రవర్ధిల్లింది. అయితే ఈ శాఖలోగూడ కాశీపతిగారు పోయిన పోకడవేరు.

నిరోష్ఠ్యంలో నిరోష్ఠ్యం, శుద్ధ నిరోష్ఠ్యం అను రెండు భేదాలున్నవి. పవర్గంతోపాటు ఉకారాన్ని వకారాన్ని గూడ విడిచిపెడితే ఆ కావ్యం శుద్ధనిరోష్ఠ్యం అవుతుంది. కాశీపతిగారి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానం ఆ శాఖలో ఒక కొత్త ఒరవడి పెట్టి కలికితురాయిగా నిలిచింది.

నిరనుసాసిక కావ్యాలు తెలుగులో రాలేదు. కానీ, ఆ లోటునిపుడు కాశీపతిగారి "శౌరి శైశవలీల" తీర్చింది. అయితే ఈ రంగంలో ఇంతవరకే కాణాదం పెద్దనగారి "శేషశైల లీల" వచ్చింది. కానీ అది లభించనందువల్ల యిపుడు కాశీపతి గారిదే అద్వితీయ కావ్యంగా ఉంది

అంతేకాక త్య్రర్థి కావ్యాలు అపంచవర్గీయాలు రెండూ ఈ పాలమూరు జిల్లాలోనే రావటం గమనింపవలసిన అంశం.

కాశీపతిగారి ముప్పది అర్థాల పద్యంగూడ ఒక అపూర్వ సృష్టి అయితే అదికూడ అతనికంటె మొదలే గద్వాల సంస్థానంలోనే వచ్చింది. కామసముద్రం అప్పలాచార్యులు యధాశ్లోక తాత్పర్యానికి పీఠిక వ్రాస్తూ దానిలో తాను రచించిన ద్వాత్రింశదర్ధ క్రమాలంకార సీసం ఉటంకించి దాని అర్థాలుకూడా తెలిపినాడు. కాబట్టి ఈ విధంగా చెబుతూపోతె - కాశీపతిగారి నోటిలోనికి చూచినపుడు యశోదకు శ్రీకృష్ణుని నోటిలో విశ్వరూపం కనిపించినట్లు మనకు ప్రసిద్ధ కవులందరియొక్క విశ్వరూపం కనిపిస్తుంది.

ఇక తలకట్లు, గుడులు, కొమ్ములు గల పద్యాలు అప్పకవీయం చతుర్థాశ్వాసాంతలో ఉన్నది ఏత్వాలు నాకెక్కడా కనిపించలేదు. సంస్కృతంలో హ్రస్వమైన ఏ కార ఓ కారాలు లేవు. కనుక ఆ సాహిత్యంలో గూడ ఇవి ఉన్నాయో లేదో-

ఏత్వాలలో నా వరకు కాశీపతిగారి పద్యమే మొదటిదిగా కనిపించింది. దాన్ని చూచి నేను శ్రీమత్ప్రతాపగిరి ఖండంలో ఓత్వాలలో ఒక పద్యాన్ని కూర్చినాను.

ఆర్యా శతకం రచించే అపుడు నాకిటువంటి శబ్ద చిత్రాలలో అవసరం అయింది కాబట్టి ఆ సమయంలో ఈ వేటలో పడితే నాకెన్నో చిత్రాలు

కనిపించినవి. అయితే అవన్నియిపుడు ఒక్క కాశీపతిగారిలోనే మళ్లీ దర్శన మీయటం నాకు ఆశ్చర్యం అనిపించింది.

ఇంతవరకందరూ అక్షరాలలోనే చమత్కారాలు చేసినారు కాని వత్తుల జోలికెవరూ పోలేదు. - కాశీపతిగారు అక్షరాలలోనేగాక "తెల్గునేర్వఁక స్త్రీగల్గగా కై జేసి",-'అగ్గి కర్పఁణమ్ము' అనే పద్యాలలో అక్షరాల వత్తులలో అపూర్వమైన విషయాన్ని సృష్టించినారు. ఇది ఈయన యొక్క అపూర్వ ప్రతిభకు తిరుగు లేని నిదర్శనం.

సంస్కృతంలో మాఘమహాకవిని గురించి

శ్లో॥ "ఉపమా కాళిదాసస్య - భారవేరర్థగౌరవం -
దండినః పదలాలిత్యం - మాఘే సంతిత్రియో గుణాః"॥

అని సూక్తినిలిచిపోయింది· అలాగే ఈ మూడు గుణాలలో కాశీపతిగారి కవితలో అల్లసాని పెద్దనగారి కవితాకళ, పాండురంగని పదగుంఫనం వేమకూరి చమత్కారమైన విరుపులు మూడు చోటు చేసికొన్నవి కనుక ఆ మహాకవి తన కవితా చమత్కారాలను మిత్రుడు రసప్రియకు అంకితమిచ్చి అతనిని సార్థక నామునిగావించినందులకు హర్షిస్తున్నాను.

యువ నామసంవత్సర భాద్రపపూర్ణమ
ది 09-09-1995

సాహిత్యారాధకుడు
కపిలవాయి లింగమూర్తి

కవిసింహుని కడపటి రచన

## -: చ మ త్కృ తి :-

సీ॥ స్థిర నివాసంబు మాచెర్లను నొనరించి
కవన వ్యాసంగపుఁ జవులు విడక
సరస చమత్కార సరళోక్తియుత శబ్ద
చాతురిఁ గేశవాచార్యునకును
నన్యోన్య రాగ ప్రేమాంత రాప్యాయత
చిహ్నంబు నవని సుస్థిరము నిలుప
గౌతుకోత్సుకుడునై కవి కాశిపతి సింహ
రాట్టొక కావ్యంబు రమణ మీఱ
రచన జేసి యలంకార రత్నములను
పొదిగి యొక కంఠహారం బపూర్వముగను
కేశవార్యున కిచ్చె సత్కీర్తి మెఱయ
కవుల వాత్సల్య మగణిత గణితి కాదె॥

వ॥ ఇటి భాగ్యశాలియైన కేశవాచార్యుల వారెవరన నీ కాశీపత్యవధాని గారికి॥

మ॥ చిరమిత్రుండును శిష్యుఁడున్ కవి జనాశ్లిష్టుండునున్ 1 ఘోతెదా
ర్వరవంశ్యుండును శీల సద్గుణుడు శ్రీరంగాపురీ ధామ ధీ
వరుఁడౌ కేశవ నామ యార్యుకృత సేవా కర్షణన్ పొంగి సు
స్థిరమున్ ధీమతి పేరు శాశ్వతము నుద్దీపింప నుత్సాహియై॥

మ॥ తన వార్ధక్యపుఁ బెంపుతో రచన చిత్రంబున్ సమాకృష్ట వ
ర్ధనమై యొప్పెడు వాగ్ఝరీ ప్రగతి సార్థంబొంద శాశీపతీ
ఘన సచ్ఛిల్పి "చమత్కృతీ" యనెడు సత్కావ్యంబు నిర్మించి శి
ష్యుని పేరుందన పేరు నిల్పె ధరణిన్ శోభిల్ల నౌత్సాహియై॥

వ॥ "చమత్కృతి" యను రచనమే నాటిదన

క॥ *కవితార్ణవ నిధి పుడమిని
వివరించెడు క్రీస్తు వౌనవెంబరుఁ దారల్
రవణింప నీ చమత్కృతి
సువిచారుఁడు రచన జేసె క్షోణిన్ వెలయన్॥

వ॥ ఇయ్యది కవిసింహని బ్రహ్మ సాయుజ్యమునకు సరిగా 2 నొక్క నెలకు పూర్వమని కేశవాచార్యులకు శ్రీవారు వ్రాసిన లేఖ వలన తెలియుచున్నట్లు శ్రీ త్రిపురనేని సుబ్బారావు కథనము నుండి తెలియుచున్నది.

(బ్రహ్మశ్రీ అలంపురి బ్రహ్మానంద కవి గారు రచించిన
"కవి సింహ కాశీపతి సంక్షిప్త సాహిత్య చరిత్ర" నుండి)

---

(1) "ఫోతేదారు-షరాపు" యనునవి సనాతము నుండి నైజాము ప్రభుత్వము వరకు విశ్వ బ్రాహ్మణులకు గల పారంపరిక బిరదములు ప్రభుత్వమునకు రాబడియగు (ధన) నాణెములను పరీక్షించి, యా ధనము ప్రభుకోశా గారమునకు చేరునంతవరకు వీరి వద్దనె నిలువయుండెడిది. (2) 27-12-1974

* కవిత-4 (చతుర్విధ కవితలు), అర్ణవ-7 (సప్త సాగరములు), నిధి-9 (నవనిధులు), పుడమి-1 (ధరిత్రి) తారలు-27 (నక్షత్రములు) = 27-11-1974

# కృతి స్వీకర్త నివేదనం

శ్రీ కాశీపత్యవధానులవారు గద్వాల రాజాస్థాన కవులుగా నున్నను పొరుగు సంస్థానాలైన వనపర్తి, ఆత్మకూరు, కొల్లాపురం, గోపాల్‌పేట మున్నగు సంస్థానాలలో విద్వత్ సభలు చేసి సన్మానాలనందుకొను చుండెడివారు. వనపర్తి సంస్థానంలో గల మా స్వగ్రామమైన శ్రీరంగాపురంలో ఫాల్గుణ శుద్ధ మందు జరుగు శ్రీ రంగనాయకస్వామివారి మహోత్సవ సందర్భంలో అవధానులవారికి వార్షిక సంభావన సన్మానాలుండేవి. శ్రీ రంగనాయకస్వామివారు వనపర్తి సంస్థానాధీశ్వరులకు ఇలువేలుపు రథోత్సవం ఫాల్గుణపౌర్ణమినాడు మహా వైభవంగా జరిగేది. ఆ సందర్భంలో జాతర పదిహేను రోజులు జోరుగాసాగేది. అది నా చిన్నతనం. శ్రీవారు మా తాతగారి హయామునుండి ప్రతి సంవత్సరం రథోత్సవానికి ముందే విచ్చేసి అతిథిగా మా యింట్లో పది పదిహేను రోజులుండే వారు. ఇతర కవిగాయక పండితులు కూడ విచ్చేసేవారు. పండిత శుశ్రూషభాగ్యం నాకప్పుడే లభించింది. కుటుంబంలో చిన్నవాడిని అయిన నేను కాశీపతిగారి నంటిపెట్టుకొని సపర్యలు చేస్తుండేవాడిని అప్పటికి శ్రీవారు సారంగధరీయం అను మూడర్థాల కావ్యం వ్రాసి గొప్పపేరు గడించారు, "స్వామీ మావాడిని వెంట తీసుకొని వెళ్లి విద్యా వంతుణ్ని చేయండి" అని మా నాన్నగారు కాశీపతి గారితో కోరినారు. వారప్పుడు కొన్ని గ్రంథముల పేర్లు చెప్పి వాటిని చదువు మన్నారు నన్ను. అప్పుడు నాకేమాత్రం పాండిత్యం లేదు. పండితుణ్నీ కవిని కావాలని ఉండేది. వీధిబడిలో తెలుగు చదివాను, రాజభాష ఉర్దూ కాబట్టి ఉర్దూ పార్సి చదివించేవారు. అయినను భారత భాగవతాదులు తప్పక చదివించేవారు. నాది మెట్రిక్ వరకు ఉర్దూమీడియం. బి.ఎ. ఇంగ్లీషు మీడియం. అయినా స్వయంకృషితో తెలుగును అభివృద్ధి పరుచుకున్నాను.

పండిత కవులకు జన్మభూమియైన పాలమూరు గడ్డన జన్మించినందువల్లను పండిత శుశ్రూషవల్లను మా యింట్లో సాయం వేళల భారత భాగవతాదులు మా తాతగారు మా పెదనాయనగారు మా అన్నయ్యలను బాబాయిని చదివిస్తూ వ్యాఖ్యానిస్తూ రాగ యుక్తంగా పద్యాలు చదువుతుంటే ఒక మూలన కూర్చుని శ్రద్ధగా శ్రవణం చేస్తుండటంవల్లను బాల్యదశలోనే నా హృదయక్షేత్రంలో కవితా బీజాలుపడినవి. విన్న పద్యాలు ఏకాంతంలో ఆలాపిస్తుండేవాడిని.

ఆ ధోరణిలో నాలో కవితా ధారసాగి పోతూ ఉండేది ప్రతిపాండిత్యంతో పద్యాలు వ్రాశాను, కాశీపతి గురువు గారికి చూపాను. ధోరణి బాగుంది. భావాలున్నవి. భాష వాలదు గ్రంథాలు బాగా చదువాలి అబ్బాయి అని కొన్ని లక్షణ గ్రంథాల పేర్లు చెప్పారు క్రమంగా వాటిని చదివాను.

నేను కొల్లాపురంలో చదువుతున్నపుడు కాశీపత్యవధానులవారికి నగరులో కవితా సభ యేర్పాటయింది. అందు ఆహ్వానితులైన పండితులకు ప్రముఖులకు మాత్రమే ప్రవేశం ఉంది. నేను కాశీపతిగారి వెంట మరచెంబుతో మంచినీళ్లు పట్టుకొని వెళ్లాను. మొదటిసారిగా శ్రీవారి కవితా సభ చూశాను. గంటకు అడిగిన అంశములపైన కోరిన చందస్సులో 100 పద్యాలు ఆశువుగా చెప్పాలి. సభ ముగిసేదాక కవిగారిదంతా నిర్వచనమే - కవిగారు 200లకు పైగానే పద్యాలు చెప్పారు - మధ్యలో పండిత పృచ్ఛకులొకరు యతి విషయమధిక్షేపించి నప్పుడు కవిసింహము నిజంగానే కవిసింహమైపోయి సమాధానం తేలికగా పద్యపరంపర గర్జనలతో చెప్పారు. పృచ్ఛకుల అధిక్షేపణ తెలియక చేసినదని తేలిపోయింది. అంత వేగంగా ఆశువుగా పద్యాలు చెప్పడం నేనింతవరకు చూడ లేదు. ఆ రాత్రి సభ అనంతరం తిరిగి ఇంటికి వస్తూ దారిలో నేనన్నాను - మీరింత గర్వంగా అహంకారంగా ప్రవర్తించటం నాకంత సమంజసంగా అని పించలేదు 'కాదబ్బాయి వాళ్లు నన్ను క్రిందపడగొట్టడానికి ప్రయత్నించారు, శక్తిసామర్థ్యాలున్నవాడిని, నక్కవినయాలు నాకెందుకు నేను కవిసింహమును' అని ధీమాగా అన్నారు.

శ్రీ కాశీపతిగారి శుశ్రూష - సాన్నిహిత్యంతో, నాటి కొల్లాపురం రాజాస్థాన కవి శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారి శిష్యరికంతో నా కవితాలత చిగురించించి పుష్పించసాగింది. అప్పటికి సంస్థానాలు కేంద్రంలో విలీనమై పోయినయి. (1948) రాజపోషణ కోల్పోయిన కాశీపతిగారికప్పుడు ప్రభుత్వ మిచ్చు నెల భత్యం (రూ॥ 50/-) తప్ప - ఎవరైన సభలుపెట్టిస్తే తప్ప - వేరే ఆధారంలేదు. వార్షికాలుండేవి కాని అవి ఉన్నను లేని సమానమే. ఇచ్చేది స్వల్పం, పదిసార్లు తిప్పించుకొనేవారు. ఈ పనిపై వారివెంట అనేకసార్లు తిరిగిన నాకీ విషయం తెలిసు.

1950-72 వరకు హైద్రాబాదులో ఉద్యోగరీత్యా కుటుంబసమేతంగా ఉంటూండేవాడిని. హైద్రాబాదులో (1960) ఒకానొక సాహిత్య సభలో నాకు మళ్లీ శ్రీవారి దర్శన భాగ్యం కలిగింది. చిరకాలానికి కలుసుకొన్నందుకు మేమి రువురము హర్షపులకితులమయ్యాము. ఆ రాత్రి సభానంతరం నేరుగా శ్రీవారు నా వెంట మా యింటికి విచ్చేశారు అప్పటి నుండి శ్రీవారు హైద్రాబాదుకు వచ్చినప్పుడల్లా పూర్వపరిచయంతో మా యింట్లోనే కొన్ని రోజులు ఉంటూఉండే శ్రీవారు. అప్పుడు శతావధాని. శ్రీ బాలబ్రహ్మాచార్యులవారు (అంధులు) కూడమా యింటికి విచ్చేసేవారు వారెంతో రసజ్ఞులు. వారిద్దరు కలిసి వచ్చినరోజు పండుగ రోజులా ఉండేది. కవితా రసప్రసంగాలతో సాహితీ పరిమళాల ఘుమఘుమలతో మా యిల్లు పన్నీటి జల్లుతో నిండినట్లయి పోయేది. వారిపురి ప్రభుత్వం అల వెన్నెలు సభలయేర్పాట్లు అకాడమిపైరవీలు మొదలగు వారి పనులలో తోడ్పడే వాడిని. అప్పుడే నా మిత్రులు శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు శ్రీ ఆలంపూరి బ్రహ్మానందంగారు మా యింట్లో శ్రీ కాశీపత్యవధానిగారిని సందర్శించుకొనిరి. సుబ్బారావుగారు కాశీపతి జీవిత చరిత్ర వ్రాయడానికి ప్రణాళికను శ్రీవారి సమ క్షంలో రూపొందించుకొనిరి. మరియు సచివాలయంలో సభ పెట్టించిరి. మిత్రులు శ్రీ యస్వీ రామారావుగారు తమ విద్యార్థి దశయందే కవిగారికి సభలు పెట్టించి సన్మానించిరి. ఒకటి జోతిర్మయి తరపున మరొకటి ఉస్మానియ యునివర్సిటిలో- వారు జోతిర్మయి సాహిత్య సమాఖ్య స్థాపకులు.

1971 లో హైద్రాబాదుకు వచ్చినప్పుడు మా యింట్లో ఒకరోజు ప్రసన్న హృదయంతో శ్రీ కాశీపత్యవధానులవారు నాచే దక్షిణతాంబూలాదులు స్వీకరించి చమత్కృతి రూపొందించి ఇచ్చెదనని చెప్పిరి. అప్పుడే మేమిద్దరం కోఠికి వెళ్ళి ఫొటో తీయించుకున్నాము. 1972 జూలై నుండి నేను జిల్లాఅధికారిగా చిత్తూరుకు ప్రమోషన్‌పై వెళ్ళి అక్కడి నుండి వెంటవెంట నానా జిల్లాలకు (కరీంనగర్, ఆదిలాబాదు, హైదరాబాద్, వరంగల్ మళ్ళి హైదరాబాద్) 1974 డిశంబరు వరకు బదిలీలు అవుతుండటంవల్ల శ్రీవారి దర్శనభాగ్యం మాకు మరల కలుగనే లేదు. అయినా మేమెక్కడున్నను మాకు వారికి ఉత్తర ప్రత్యుత్తరములు నడు స్తుండేవి. 1970 లో 1971 లో వరుసగా మా యిద్దరి కూతుళ్ళ వివాహాలు హైద్రాబాదులో నుండగానే చేశాము. ఆ సమయంలో శ్రీవారు మా వద్దనే ఉన్నారు. అనుభవం లేక, అండదండలు లేని మాకు శ్రీవారు పెద్ద దిక్కుగా

ఉన్నందున వారిని ముందిడుకొని వివాహాలు చక్కగా జరిపించగలిగాము. వారు ఆశీర్వచన పద్యాలు వ్రాసి చదివారు. వారికి మా పై అవ్యాజమైన ప్రేమాదరాలుండేవి, వారు వ్రాసిన ప్రతి లేఖలో మా కుటుంబ యోగక్షేమాలు ముఖ్యంగా అస్వస్థురాలైన నా భార్యను కన్న తండ్రివలె ఆమె క్షేమమరసికొను చుండెడివారు. వారు మా తాతగారికి ప్రియతమ పండితులు. మా చిన్నాన్నగారికి "గౌరీనాథ శతకము" సంకితమిచ్చినారు

1974 నవంబరు 27వ తేదిన కరీంనగర్‌లో నున్న నాకు లేఖ వ్రాస్తూ చమత్కృతి సిద్ధమైనదని తనను పిలిపించుకొనుమనియు త్వరలో ముద్రణ ప్రయత్నం చేయవలెనని తొందరపెట్టిరి. అప్పుడు నేను బదిలీల వల్ల కలుగు ఇబ్బందులతో సతమతమౌతున్నాను. సరిగా ఆ లేఖకు ఒక నెల తరువాత తేది 27-12-1974 న శ్రీవారు దివంగతులైనారని రేడియో మెస్సేజు ఇవ్వమని నాకు టెలిగ్రాం మాచర్ల నుండి కరీంనగర్‌కు వచ్చింది. ఆదిలాబాదుకు బదిలీ అయి చేరి పనిచేస్తూ సెలవుపై కరీంనగర్‌కువచ్చియున్న నేనువెంటనే హైద్రాబాదుకు వెళ్లి మెస్సేజి యేర్పాటు చేసితిని. తరువాత 1975 లో నల్లగొండకు బదిలీ అయి ఉన్నప్పుడు ఒకరోజు నేను మాచర్లకు వెళ్లి శ్రీవారి కుమారులను కలిసి మాట్లాడి వారి నుండి నాకంకితమిచ్చిన చమత్కృతి వ్రాత ప్రతిని తీసికొంటిని. బాల్యదశ, అవతారిక, ప్రశ్నోత్తరాలు కొంత స్వయంగా వ్రాశారు, కొంత వ్రాయింబారు. కొన్ని అంశములు శ్రీవారి లేఖలనుండి నన్నడిగిన ప్రశ్నలు మరి కొన్ని అంశములు శ్రీ మంచాల జగన్నాధరావుగారితో శ్రీవారి చిత్రకవితా ప్రసంగం క్యాసెటు నా వద్ద ఉన్నందున ఇవి అన్నింటిని తీసికొని మిత్రులు శ్రీ అలంపురి బ్రహ్మానందంగారికిచ్చితిని. శ్రీ బ్రహ్మానందంగారు "కవి సింహ కాశీపతి సంక్షిప్త సాహిత్య చరిత్ర" పద్య కావ్యంగా వ్రాసిన పండితులు. వారు పరిష్కరించి శుద్ధ ప్రతిని తయారించిరి.

ఇది కవి సింహ కాశీపత్యవధానిగారి చిట్ట చివరి కావ్యం. తాము రచించిన కృతులందు గల చమత్కృతి పద్యములు గూర్చి తీర్చిదిద్ది 'కాశీపతి చమత్కృతి' యను పేర ఖండకృతిని నాకంకితముగా ప్రేమాదరములతో నొసంగిరి. దీని ముద్రణ తమ జీవిత కాలముననే కావాలని కాంక్షించిరి. కాని విధివశాత్తు అట్లు జరుగలేదు. తమ జీవిత చరిత్ర వెంటనే వెలువరించవలెనని సుబ్బారావుగారికి చెప్పుమని నాకు తమ లేఖలో తెలియపరిచిరి. కాని, అదియును విధివశాత్తు శ్రీవారు దివంగతులైన పిదపనే 1979లో ముద్రింపబడెను.

శ్రీ కాశీపత్యవధానులవారు విశ్వవిఖ్యాత మహా కవులు వారు నానా విద్యాకేంద్రములందు త్రివిధావధానములు, చిత్ర కవితా సభలు గావించి ఘన సన్మానములు పొందినారు. చతుర్విధ కవితాధురీణులై, దశాక్షరీయ, నిరోష్ఠ్య శుద్ధాంధ్ర, త్ర్యర్థి ప్రబంధాది గ్రంధముల సృష్టించిన చిత్రకవితా సార్వభౌములు, మహాకవిశేఖర, కవిసింహాద్యనేక బిరుదములు, కనకాభిశేక, కిరీటధారణ. గజోత్సవ, గండపెండేరాది సన్మానములందుకొన్నారు. నాటి రాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ పండితులచే గౌరవ సన్మానముల నందుకొన్నారు. అత్యంత అపూర్వ కావ్యగ్రంధముల సృష్టించి మహోన్నత కీర్తిగడించిన మహనీయులు, చిరస్మరణీయులు వారు చిరంజీవులు వారి కృతులు శాశ్వతములు ఆ మహనీయ కమనీయ కవితామూర్తి, ఆ కవన భువన సామ్రాజ్య చక్రవర్తి, ఆ పుంభావ సరస్వతి నాకు కవితా గురువులు కావటం, వారు తమ చమత్కృతిని ఆదరంతో, వాత్సల్యంతో, సౌహార్దంతో నాకంకిత మివ్వడం నా సౌభాగ్యం. నా పురాకృత సుకృతం.

కారణాంతరాలవల్ల ఈ చమత్కృతి ప్రచురణ కావటంలో జాప్యమైనది. మహాకావ్యాలకు కాలదోషం పట్టదని భావిస్తూ యిప్పటికైన నేనీ 'చమత్కృతి'ని ప్రచురించగలిగినందుకు ఊఅట జెందుచు ఉడుత రాల్చిన ఇసుక మాదిరి కవి ఋణం గురుఋణం అణువంతైన తీరుతుందేమోయని తృప్తిపడుతూ ఈ చమత్కృతి కృతిని ముద్రించి సాహిత్యలోకానికి అందజేస్తున్నాను. "సుకవి జీవించు ప్రజల నాలుకలమీద" అన్నట్లు ఈ కవిసింహుని వివిధ సాహితీ ప్రక్రియలు కవి పండిత హృదయాలలో నిలిచిపోతాయి శ్రీనాథునివలె సకల సౌఖ్యములననుభవించి చివరిదశలో దైన్యజీవితమొందినారు. "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అను వాక్యానుసారముసుకవితా విలాసకాములైనవారికి ఇతర భోగభాగ్యములపైన వాంఛలేకుండును కదా!

ఇట్లు
బుధజన విధేయుడు
'రసప్రియ' పోతేదార్ కేశవాచార్య

ఖమ్మం
ది. 19-1-98

# కృతజ్ఞతావిష్కరణ

ఈ చమత్కృతికి అభిప్రాయములర్థించినంతనే తమ మూల్యమైన సమయమును వెచ్చించి ఆలోచనామృతము నాస్వాదించినట్లు గ్రంథమంతా చదివి ఆనందించి తమ అమూల్యమైన అభిప్రాయముల నను గ్రహించి, ప్రకటన కర్త నగు నన్ను అభినందనల రూపంలో ఆశీర్వదించిన సుప్రసిద్ధ విద్వన్మణులు :

"సాహిత్యబ్రహ్మ" సార్థకబిరుదాంచితులు, బహుముఖ ప్రజ్ఞాశాలురు డా॥ వాసిలి వెంకట లక్ష్మీనరసింహారావు గారికి -

సుప్రసిద్ధ విద్వాంసులు "జోతిర్మయి" సాహితీ సమాఖ్యాధ్యక్షులు ఆచార్య డా॥ ఎస్వీ రామారావు, తెలుగు విభాగం-ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి -

విద్వత్కవులు, బహుగ్రంథకర్తలు, సాహిత్య పరిశోధకులు శ్రీ కపిలవాయి లింగమూర్తిగారికి -

'ఆంధ్రకవితా విశారద' బిరుదాంచితులు, "కవిసింహ కాశీపతి సంక్షిప్త సాహిత్య చరిత్ర" పద్యకావ్యంగా వ్రాసిన పండితులు శ్రీ ఆలంపురి బ్రహ్మానందం గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

కవిసింహ కాశీపత్యవధానులవారి రేఖాచిత్రాన్ని సహజ సుందరంగా చిత్రీకరించిన మా 2వ దౌహిత్రుడు చి॥ ఎం. వెంకటావారికి అభినందనాశీర్వాదములు.

ఈ సందర్భంలో ఆప్తమిత్రులు, సాహితీ బంధువులు "కాశీపతి జీవిత చరిత్ర" వ్రాసిన 'విమర్శకరత్న' కే. శే. త్రిపురనేని సుబ్బారావుగారికి, ఆత్మీయులు, గురుతుల్యులు శతావధాని కీ శే. బాలబ్రహ్మాచార్యులుగారికి మరియు కవిగారిచే "గౌరీనాథ శతకము"ను అంకితముగా నందుకొన్న ఆశుకవి కీ.శే. కృష్ణమాచార్యులు (మా పినతండ్రి) గారికి హృదయపూర్వక స్మృత్యంజలులు.

ఈ గ్రంథాన్ని అనతికాలంలోనే అందంగా ముద్రించి యిచ్చిన నటరాజ్ ప్రింటర్స్, ఖమ్మంవారికి అభినందనలు.

'రసప్రియ' ఫోతేదార్ కేశవాచార్య

# స్వీకృతాంజలి

— రసప్రియ

కం॥ గురుడవు సఖుడవు కవితా
గురుడవు తాత్త్వికవిచార ఘోరాటవిలో
దరిజూపు ప్రాజ్ఞుడవు మా
* తర తర తర తర తరాల తాతవయారే!

ఆ॥ నేను మెత్తబడితి నీ కొసంగిన చమ
త్కృతిని అచ్చువేసి అతులకీర్తి
అందుకొనుము కేశవాచార్య శీఘ్రమే
యనుచు దెలిపి దివికి నరిగినావు॥

చ॥ కృతిపతి జేసి నాకు ఘనకీర్తి ఘటిల్లగజేసినావు త్వ
త్కృతిని చమత్కృతిన్ వెలువరించితి నీవట సంతసింప - ఏ
గతి జలరాశులింకక జగాన ప్రవర్తిలుచుండునట్లె నీ
అతులితమౌ అపూర్వ కవితాంబుధులింకవులే కవీశ్వరా!

గీ॥ నీ చమత్కృతి నాకు నంకితమొసంగి
దాతవైతివి నేను గ్రహీతనైతి
దాతనాశ్రయించి కదా గ్రహీతనెగడు
చిత్రకవిసార్వభౌమ ఆశీర్వదించు.

గీ॥ కృతికి కృతిపతి కమరత్వమిచ్చు సుకవి
బ్రహ్మమించిన బ్రహ్మకైవ వఱలుగాదె!
అతని కృతమెల్ల నశియించు నితనికృతము
శాశ్వతమ్మయి విలసిల్లు విశ్వమందు -

గీ॥ నాకు నీ చమత్కృతి నిచ్చి నన్ను దిక్కు
లెక్కజేయు దాతా! నీదు ఋణభరమ్ము
చేతమూర్ధమ్ము వాల్చితాశీర్వదించు
చిత్రకవిసార్వభౌమ కాశీపతీంద్ర!

కం॥ ప్రతి పద్యము రత్నంబగు - కృతిమూల్య మమూల్యమైన నేప్రేమన్ ప్రీతిన్
కృతినాకిచ్చితొ దానికి - ప్రతిఫల మేమీయగలను ప్రణుతులు తప్పన్!

కం॥ కవితా చిత్రములెన్నియొ - వివిధ కళారుచులవెన్నొ వివరించిన ఓ
కవితానిధి! కాశీపతి! - నవరసపాథోధి! నీకు నతులర్పింతున్॥

---

* మా తాతగారినుండి మనుమళ్ళ వరకు ఐదు తరముల వారము కవిగారి ఆశీః పరంపరనందుకొన్నవారము



"చమత్కృతి" స్వీకరణ సందర్భములో 1971

| కృతికర్త | కృతిభర్త |
|---|---|
| మహాకవిశేఖర. కవిసింహ | "రసప్రియ" |
| శ్రీ పోకూరి కాశీపత్యవధానులు | శ్రీ పోతేదార్ కేశవాచార్యులు |



"చమత్కృతి" స్వీకరణ సందర్భములో

| | |
|---|---|
| కృతికర్త | కృతిభర్త |
| మహాకవిశేఖర. కవిసింహ | ''రసప్రియ'' |
| శ్రీ పోకూరి కాశీపత్యవధానులు | శ్రీ ఫోతేదార్ కేశవాచార్యులు |

ఓం

పరబ్రహ్మణే నమః

# కాశీపతి చమత్కృతి

## —: కాశీపతి బాల్యదశ :—

కేశవాచారి : మహాకవి శేఖరా! మహాజాతకులగు తాము జనించిన శుభదివసం బును దెల్పి నన్ను సంతోషపరుతురా?

కాశీసత్యవ ధానులు } రసప్రియా! అలాగే సూత్రప్రాయంబుగా దెల్పెద నాలింపుము.

కం॥ నందనవత్సర మాఘము
నందున తొలి దశమి యందు నర్కుండుదయం
బందు నెడ నే జనించితి
నందురు తలిదండ్రు లప్పు డప్పుడు నాతోన్॥

### ద్విప్రాసము

కం॥ నందన సమ యందున తా
నందన మణినొంది నందునన్ దమ యందున్
నందనమున చందన మన
నందనమిడు నందురంట నా తండ్రికొరుల్

### త్రిప్రాసము

కం॥ మరుఁడగు రూపంబునను కొ
మరుఁడగు గోకలిత విక్రమంబున ప్రష్టా
మరుఁడగు చదువుల నీదు కొ
మరుఁడగురా యందురంట మత్పితకార్యుల్

కేశవ : వ॥ తమ విద్యా గురువుల కొందఱిని దెల్పెదరా?

కాశీపతి : సీ॥ తగవెజ్జు వేదాంతి యగు మేడికొండ నా
రయ నేర్పెనాకక్షరాళి పురిని
తొడరి కే. ఎఱ్ఱాహ్వయుఁడు వెలుదుర్తిలో
తెలుగు విద్దెయన నన్ దీర్చి దిద్దె
అటనె డీ. పెద జానయాఖ్యుఁడు కవితకై
యతి గణప్రాసములమర దెల్పె
రెంట చింతల పాదిరిబడి నేనయ ఘస్టు
ఫారమున్ గెల్పింపఁ జేరితినిలు

తే॥ నవ్య శ్రీగిరి పాటెలో నాదు పెద్ద
తండ్రి రంగోజు కోటయార్యుండు తార
కముఁ దెలిపె వీరి దీవెనల్గనుట సహజ
పాండితియు నాశుకవిత ప్రజ్వరిలె నాకు.

డి. పెద జానయ గారు యతి గణ ప్రాసములను కంద లక్షణములను తెల్పినయంతనె యీ క్రింది పద్యమును వ్రాసి చదివి వినిపించితిని.

కం॥ పొందుగ డీ పెదజానయ
ముందుగ గణములను ప్రాసములు యతులున్ నా
కందముగఁ దెల్పఁగా నే
కందముఁ జెప్పితిని దీని గను గొనుడయ్యా!

అన్నతోడనే "కందము కందమ"ని రెండు చరణములలో వచ్చునట్లు ప్రప్రథమముగనే వ్రాయగల్గిన నీ బాలుఁడిఁక ముందు శబ్దాలంకార శోభితుండగునని యాశీర్వదించెను.

ఇఁక నన్ను తీర్చిదిద్దిన మా ఎజ్రా పంతులు గారెట్టి వారన

మ॥ ఇఁక నెజ్రాఖ్యుఁడు జీవితాన ముటుకూరింటం గలన్నంబు వె
ల్లఁకి కూరల్ దినలేక దాచెపలి నాంగ్లంబూని పచ్చళ్ల నా
యఁ కరం బూని పరీక్షకుండు నదుపాధ్యాయుండు పల్నాటి నా
యఁకులన్ దానొకఁడై సుబోధకుఁడు సంఘాచార్యుఁడై భాసిలెన్.

ఇఁక మా ఎజ్రా పంతులుగారు బాల్యమున స్వగ్రామమగు ముటుకూరున తమ యింటిలో నమరు కూలభోజనమును గడ్డకూరలను తినలేక దాచెపల్లిలో పాదిరి హాస్టలులో చేరి ఘోంచేయుచు నింగ్లీషు చదువుకొని పెద్దయై కొంతకాలము మిషన్ స్కూళ్ల సూపర్వైజరుగను, హెడ్మాస్టరుగను మరికొంత కాలము తాలూకా బోర్డు మెంబరుగను, ప్రబోధకుడుగను, రెవరెండ్ పాప్పరుగను పనులుచేసి కీర్తిశేషుడాయెను.

కేశవ.: గురువర్యా! ఇందు మీ చమత్కృతి యేమియు గనిపించలేదే?

కాశీపతి : అయ్యో! లేకేమి? నేను గద్వాలలో ఆస్థాన కవిగ నుండినపుడు - పేర్లు చెప్పనేల, కాని అప్పటి సుప్రసిద్ధ మహాకవులలో నొకరిని మరియు నొక సుప్రసిద్ధ కవి వక్ష్యమాణ రీతి యిట్లనియెనట.

చం॥ "ఇఁక యను ప్రాసమందునిడి వృత్తము వ్రాయుము మిత్ర రత్నమా"
అని అనగా—

"ఇఁకయను ప్రాసమందు నిడి యెవ్వరు చెప్పగ లేరు మిత్రమా"
అని సమాధానమిచ్చెనని ఆంధ్రపత్రికలో ప్రకటింపబడగా నేనదిచూచి,
యిదే ప్రాసముతో—

చం॥ "ఇఁక నను ప్రేమతో గనడొ యేమొ వనంబునఁ జెట్లనుండి వె
ల్లఁకి గమి కాయలాకుల నెలర్పగ మెక్కెడు దాని వెంచు నా
యఁకు కొమరిన్ మదావయవ నర్మిలిఁజేకొని దాని కొంప నా
యఁ కరము నూనియుండె నహహా నరకేసరి నేమనన్ వలెన్"

అని వ్రాసి ఆంధ్రపత్రికకు పంపితిని. అపుడు నాకింకా చిన్నవయసు. మీ ఆస్థాన కవిని మందలించవలసినదని మా రాజా వారికి లేఖవ్రాసి పంపిరి.

## జ ల గ ం డ ం

కాశీపతి : కం॥ అలరగ విద్యాసక్తిన్
బలు తెలుగుల గ్రంథములను పఠియింపుచు నే
మెలగెడునెడ నాకొదవిన
జలగండము తప్పకున్న సమయుదు గాదే॥

కేశవ : ఎట్లెట్లు? తమకు జలగండమా! అది యెవరు బాపిరి? మరియొకసారి తెల్పుడు.

కాశీపతి : గీ॥ భావి జీవనమిటు నాకు ప్రబలవలసి
బావి జీవనమున మృతి బాపె హితుడు
ధాత్రి గర్భమునే బాల్యదశన జొరమి
ధాత్రి గర్భము చలువ గదా తలంప॥

కేశవ : తా॥ భావిజీవనమనగా ముందు జరుగగల జీవన కాలమిట్లు పెరుగ వలసియుండి, బావి జీవన గండమనగా నూతిలో జలగండము నొక మిత్రుడు తప్పించెననియు, బాల్యమున నే భూగర్భము జొరకుండుట, ధాత్రి అనగా తల్లికడుపు చలువ యనుచున్నారు. మిమ్ము జలగండం నుండి తప్పించిన సఖుడెవ్వడో, యెట్లు తప్పించెనో తెల్పెదరా!

కాశీపతి : తెల్పెద వినుము కీలక సంవత్సరమున అత్యంత తీక్ష్ణక్షామము—

గీ॥ మొనసి పోకూరి శ్రీలింగమూర్తి యనెడు
నాదు పెదతండ్రి మరదలి నందనుండు
హితుడు నెదుటి గృహస్థుడై యెసగు కన్నె
కంటి గురులింగమయ నను కరుణ మనిచె॥

అందుచేతనే—

ఉ॥ లింగనిమౌళిపై పయిదలింగని సొంకుని పాలవెల్లి చూ
లిం గని గట్ల జిడ్డు కడలింగని కాలగళాన్వితున్ గపా
లిం గని నీల వస్త్రు ముసలిం గని వారిదవేణి వాణి నో
లిం గని కన్నెగంటి గురులింగని కీర్తి హసించి భాసిలున్॥

కేశవ : కవి శిరోమణీ! తమ నుండి ప్రప్రథమమున తమ కవితను కృతినందిన పుణ్యపూరుషునొక పర్యాయము తెల్పగలరా!

కాశీపతి : తెల్పకేమి? నట్టా బ్రహ్మయ చౌదరి యను నా మిత్రుడే.

సీ॥ పుట్టి నారమొకేట బోడిల వీటను
పెరిగినారము బాలవిధుని విధము
పెట్టినారము మేల్మిపేరైన సొమ్ములన్
కట్టినారము పట్టు పుట్టములను
మెసవినారము మృదు మృష్ట పదార్థముల్
చదివినారము పాఠశాల నొకట
ఆడినారము మేని కారోగ్య మెసలార
పాడినారము కడు వేడుకలర

గీ॥ నొక్కనాడేను గాన్పింపకున్న నన్నుఁ
జేరి "కాశీపతీ! యేమి సేయుచుంటి"
వనుచు కూర్చుండి తగు మాటలాడి యేగు
మరువశక్యమె? బ్రహ్మయ పరమమైత్రి॥

సీ॥ రచియింపఁజేసె తాఁ బ్రచురింప నాచేత
ధూర్జటి శతకమున్ దొట్టతొలుత
పేర్వెట్టె కవియని పేర్మి నాకాకృతిన్
ముద్రింపగాజేసి మొట్టమొదట
నూరేగఁజేసె చెన్నార గ్రంథములనన్
తూర్యంబులెసలారఁ దొట్టతొలుత
సత్కరించెను నను శతకమున్ గృతినంది
మొదవువల్వలనిడి మొట్టమొదట

గీ॥ నిపుడు నేత్రర్థి కావ్యాదులెన్నొ చేసి
సింధురోత్సవ కనకాభిషేక బ్రహ్మ
రథమహోత్సవ మంజీర రత్నహార
ములను బడసితి బ్రహ్మయ్య చలువగాదె!

గీ॥ తొలుత బ్రహ్మయ యొసగిన వలువలేట
నీను నన వస్త్రములు వచ్చి మేననిల్చి
కొని యెఱుగ నేటి కొక తుండుగుడ్డయైన
చెప్పశక్యమె? బ్రహ్మయ చేతి చలువ॥

శా॥ నట్టా బ్రహ్మయ చౌదరిన్ సుమతినెన్నంగా మహాసత్వమం
దిజ్జిన్ బూనినవాని వాని తనయున్ హెచ్చున్ ప్రతాపంబునన్
దిజ్జిన్ బూనిన వాని వాని తనయున్ హెచ్చున్ సదా సౌమ్యమం
దిజ్జిన్ బూనిన వాని వాని తనయున్ హెచ్చున్ విచిత్రంబగున్॥

టీ॥ నట్టాబ్రహ్మయ చౌదరిన్ సుమతిన్=నట్టా బ్రహ్మయ చౌదరియనుబుద్ధి మంతుని, ఎన్నంగా=గణనసేయగా, మహాసత్వమందు=అతిశయించిన బలము నందు, ఇజ్జిన్ బూనినవానిన్=జింకను వాహనముగాపూనుకొన్న వాయుదేవునిన్, వాని తనయున్=అతని కొడుకగు నాంజనేయుని, హెచ్చున్=మించిన వాడగును, ప్రతాపంబునన్=పరాక్రమమున మించిన వాడనియు, ఇజ్జిన్ బూనినవానిన్= జింక తాల్పరియైన శంకరుని, వాని తనయున్=అతని కొడుకగు కుమార స్వామిని, సదాసౌమ్యమందు=ఎల్లప్పుడు శుభములందును, హెచ్చున్=మించును, ఇజ్జిన్ బూనినవాని=జింకతాల్పరియైన చంద్రుని, వాని తనయున్=అతని కొడు కైన బుధునిన్, హెచ్చున్=మించును, విచిత్రంబగున్=మిక్కిలి చిత్రము కదా!

కం॥ శ్రీయుతుని త్యాగమందున
శ్రీయుతునైశ్వర్యములను శ్రీయుతు నరితిన్
శ్రీయుతుఁ జదువుల గెల్చున్
శ్రీయుతుడగు బమ్మవేరి చెలువుం డహహా!

టీ॥ త్యాగమునందు = త్యాగము చేయుటలో శ్రీయుతునిన్ = సంపద్యుక్తుడు కుబేరుని, ఐశ్వర్యములను = అణిమాద్యష్టకము లందు, శ్రీయుతున్ = గౌరీయుతుడగు శంకరుని, అరితిన్ = ప్రేమ = కరుణయందు, శ్రీయుతున్ = లక్ష్మీయుక్తుడగు విష్ణువును, చదువులన్ = విద్యాధిక్యము చేత, శ్రీయుతున్ సరస్వతీయుక్తుడగు బ్రహ్మదేవుని, శ్రీయుతుడగుటన్ = శోభాయుక్తుడైనందున, బమ్మవేరి = విప్రారియగు బ్రహ్మయ చౌదరి, గెల్చును = విజయమొందును.

గీ॥ బ్రహ్మయ సహోదరుండయి పరగు కతన
చిన్నబ్రహ్మయ నాయందు చెలిమి గలిగి
వర్తిలుచునుండు, వీరల వంశమెపుడు
తిరముగను కరముగను వర్ధిలును గాత!

—0—

ఓం పరబ్రహ్మణే నమః

# కాశీపతి చమత్కృతి

## గ్రంథావతారిక

### —: శ్రీ కేశవాచార్యుల వంశవతంసము :—

శా॥ శ్రీరామాప్తుఁడు రంగనాయకుఁడు పేర్మిన్ విశ్వకర్మాన్వయున్
శ్రీరంగా పురవాసు పావనమతిన్ విశ్వజ్ఞ గోత్రోద్భవున్
ధీరాగ్రేసరు ధర్మతత్పరుని ఫోతేదారు శ్రీకేశవా
చారిన్ దృప్తికరంబుగా సతత మీాప్సల్ దీర్చుచున్ బ్రోచుతన్॥ 1

సీ॥ చర్చింప కేశవాచారి పూర్వికులందు
పుల్లయ యను నొక బుద్ధిశాలి
రాణ శ్రీరంగాపురాన రామస్వామి
నంచిత స్థితి ప్రతిష్ఠించి స్వపురి
రాజా జనంపల్లి రామేశ్వర ప్రభు
శూరాగ్రసరుదయన్ జూరగొనియు
పరగ ఫోతేదారు పదవి వహించి వే
దాంతినా జోసినా ఖ్యాతి గాంచి

గీ॥ తనరె గాన తదాది తత్సంతతులకు
నతని పదవి సమాఖ్య గేహాభిధాన
మగుచు నాటికి నేటి కింపలరుచుండె
నెసగ పుల్లయ సద్వృత్తి నెన్నదరమె॥ 2

క॥ ఘన పుణ్యక్షేత్రంబులఁ
గనుగొనఁ జనుచుండు రాజు గావున సేజే
టను జనుదెంచిన యప్పు డె
ల్లను జను శభమునకు వేల్పులన్ నృపుడెంచున్॥ 3

క॥ మామా! మేల్గోరెడు నీ
ప్రేమను వర్ణింప వశమె ప్రియ మలరగ మా
క్షేమములు దెల్పు మనుచును
భూమీశుడు లేఖలంపు పుల్లయ కెపుడున్॥ 4

క॥ శ్రీ పాలమూరు జిల్లా
లోపల వనపర్తి సీమలోనన్ శ్రీరం
గాపురమున బొజ్జార్యుం
డీ పుల్లయ వంశమున జనించెన్ మించెన్॥ 5

క॥ అభినవ ధన్వంతరి యన
నభయ మొసగి కఠిన రోగికారోగ్యంబున్
శుభముగ గూర్చెడు బొజ్జా
ర్యభిషగ్వరు వైద్యపటిమ నలసియె పొగడన్॥ 6

క॥ సరసుడు బొజ్జయ లక్ష్మిక
నరసమ నీశ్వరమనొగి మనంబల రారన్
వరియించి పెండ్లియాడెను
పరికింపగ తనకు తగిన భార్యలనంగన్॥ 7

సీ॥ అల బొజ్జయాచారి తొలి భార్యయందున
రంగమన్ లక్ష్మమన్ రామయార్యు
జానకీ రామయాచారిని గాంచి తా
న ద్వితీయ ద్వితీయ, ద్వితీయ

యందు వేంకట రామయాంబను కృష్ణ మా
చార్యుని గాంచి రామార్యునకును
కృష్ణమాంబను జానకీరామయకు రామ
మాంబను శ్రీకృష్ణయాఖ్యునకు

గీ॥ పేర్మి నలివేణమను దెచ్చి పెండ్లి జేసె
తదుపరిన్ గృష్ణమాచారి తగ సుశీల
మాంబనొగి నాగలక్ష్మంబ నలర పెండ్లి
యాడె తొలి భార్యయందీశ్వరమను గాంచె॥ 8

క॥ ఆశు కవిత్వ ప్రియుడు సు
మేశార్చా తత్పరుండు హితమృదు భాషా
కౌశల్యయుతుఁడు దాత స
దాశయ రతుఁడెన్న కృష్ణమాచార్యుడిలన్॥ 9

క॥ రామార్యుడు శ్రీమతి కృ
ష్ణా మానిని యందు పద్మనాభాచారిన్
దామోదరుని జనార్దను
నా మీదట వాసుదేవు నతిధృతి గాంచెన్॥ 10

క॥ రామేశ్వరాంబ యను పు
త్రీమణి నాదటను గాంచె తిలకింపగ శ్రీ
రామార్యుడు లౌకికవి
ద్యా మేధావి యగునతని నలవియె పొగడన్॥ 11

సీ॥ జనక సేవాధుర్యుఁడనుపమ శీలుఁడౌ
జానకీరామయాచారి భూరి
ప్రేమను శ్రీమతి రామాంబ వలన న
క్షయ నామ వత్సర శ్రావణమున

బహుళ పంచమి స్థిరవాసర సంగత
భరణీ స్థిత తృతీయ పాదమునను
సరసుఁడా కేశవాచారి సామీదట
మాధవాచారిని మరియు సౌరు
గీ॥ మించు లక్ష్మీనరసమును గాంచి పెంచి
జ్యేష్ఠ సుతునకు కనకమస్ జన్ని కొమరు
నకును కౌసల్యమస్ గూతునకును మిగుల
పేర్మి రామేశయను దెచ్చి పెండ్లి జేసె॥ 12

సీ॥ జానొంద మాధవాచారి కౌసల్యాంబ
యందున నూర్మిళ నగ్ర తనయ
నా పిమ్మటను భారతమ్మను భాస్కరా
చారిఁ రమేశ కుమారుఁ సుగుణి
రాణి తనూజను రామకృష్ణుని గాంచి
జ్యేష్ఠ సుతన్ నయశీలుడైన
చంద్రమౌళికినిచ్చి సొరొంద కళ్యాణ
మును వేడ్కగావించి మోదమలర

గీ॥ అన్నమాటను గాని తానన్నమాట
నేనిఁదొలగక యాత్మనెంతేని పూని
కార్య సాధకుఁడగుచు చక్కగఁ జరించు
హితమతిని మాధవాచారి నెన్నఁదరమె॥ 13

సీ॥ సరసుఁడా కేశవాచారి పేరిమి పతి
వ్రతయన నిజధర్మపత్నియనగ
నలరు శ్రీమతి కనకాంబయందున బొజ్జ
యాభిఖ్య రవిబాబు నతి సుశీల
యన విరాజిలు విజయశ్రీని మఱి జయ
శ్రీ నామ శారదన్ చెన్నుమించు
మన్నన గలుగు రామశ్రీని సుగుణి నా
జను రాజశేఖరాచారి నంత

గీ॥ స్వాంతమలర శుభశ్రీ ననంతరమున
రామలింగాఖ్యుఁ దదుపరి రామకృష్ణుఁ
డను కనిష్ట తనూజు నింపలరగాంచె
క్షితి పురాకృత పుణ్య భాసితుఁడు గాన
కనకమ ఘటించె కేశవాఖ్యునకు సతిగ॥ 14

త్రిప్రాస

క॥ కనకమయగు మైత్రావిని
కనకమ యగు నొడలి జిగిని కల్మషమధులిట్
కనకమ యగు గావున శ్రీ
కనకమ కీ పేరు సార్థకంబగుఁ గాదే! 15

ద్విప్రాస

క॥ రతిని మరుద్వతిని సర
స్వతిని శమాసతిని హైమవతిని క్షితి నరుం
ధతిని శచీస్థితిని తిర
స్కృతిని సలుపు కనకమాంబ ధృతిపతి భక్తిన్॥ 16

సీ॥ శ్రీదేవి నిశ్చల చిత్తయే వల్లభు
నెదపైన నొరుగు నిల్లిల్లు దిరుగు
భూదేవి సాధ్వియౌ పొలతియే పతి గల్గి
హితమంచు పరనరపతుల నెనయు
శారదాదేవి సుస్వాంతయే యసమ వ
ర్తనమున బుధుల వక్త్రములనాను
పార్వతీదేవి సద్వనితయే సమ్మకు
కాంతుమై సగము భాగంబు గొనియె

గీ॥ గాన తక్కొరు వివరింపగా పనేమి
పతియె జీవమ్ము దైవమ్ము గతియు మతియు
స్థితి యటంచును పతిసేవ జేయుచుండు
నిలను శ్రీమతి కనకాంబ నెన్న వశమె॥ 17

సీ॥ అట్టి శ్రీమతి కనకాంబకు విభుడై యె
సంగెడు కేశవాచార్యుఁ డరసి
అగ్రపుత్రిని విజయశ్రీని భాగ్య న
గర నివాసునకు శ్రీ కలితునకును
వినయమందున మఱియు విద్యయందున పేరు
వడసిన ప్రియవాది వరగుణాఢ్యు
నారసింహాచార్యునకు నిచ్చి కల్యాణ
మొనరించె నార్యు లోహొయనంగ

గీ॥ తన ద్వితీయ సుతన్ శారదన్ ప్రభుత్వ
సముచితోద్యోగధనునకు స్మర విలాసు
నకును కోవెలకుంట చెన్నార్యునకును
పేర్మినిడి బుధులెన్నగా పెండ్లి చేసె॥ 18

## —: కేశవాచారి సుగుణాభివర్ణన :—

క॥ ఇఁక సద్విబుధ విధేయుం
డకలంకాత్ముడగు కేశవాచారి గుణ
ప్రకరంబును వర్ణించెద
సుకవులు మెచ్చుకొన యశము శోభిల్లంగన్॥ 19

ఉ॥ శ్రీరమణీ మణీ విభుఁడశేష జగత్పరిపాలుఁ డాద్యుఁ డం
భోరుహ సంభవాద్యమర పూజితపాదుడు శౌరి పావనా
చారుని విశ్వకర్మకుల సాగరచంద్రుదు సుధీంద్రుదు కేశవా
చారిని భూరిసంపద లెసంగ నొసంగి పొసంగ నేలుతన్॥ 20

క॥ శ్రీ రంగాపుర ధాముఁడు
ధీరుఁడు సువిచారుఁడతి సుధీమణి ఘోతే
దారు గృహాభిఖ్యుఁడు చె
న్నారఁడె సుజనుడన కేశవాచారి భువిన్॥ 21

సీ॥ నరహితకారియై పరుగుచుండు నతండు
నరహితకారియై పరగునితఁడు
విబుధావనుండన వెలయుచుండు నతండు
విబుధావనుండన వెలయునితఁడు
పోషణోద్యోగిగా పొసగుచుండు నతండు
పోషణోద్యోగిగా పొసగు నితడు
కనకాంబర మణిగాఁగ్రాలు చుండు నతండు
కనకాంబ రమణిగాఁగ్రాలు నితడు

గీ॥ కేశవ సమాఖ్యనొంది రాగిలు నతండు
కేశవ సమాఖ్యనొంది రాగిలు నితండు
కావ భేదంబిరువురకున్ గానరామి
నతడె యితడయి జనియించె ననుచుఁ దోచు॥ 22

చ॥ అనయము నన్నగారి నపహాస్యము జేయఁగలట్టి భోగమున్
జనకుని మించగాఁ గలుగు సద్గురు సేవయు నంతెకాక తా
తను నిరసించు బుద్ధియుఁ బితామహు తండ్రిని గేరు ప్రేమ గ
ల్గిన కుల పావనున్ సుజను కేశవనామకు నెన్నశక్యమే॥ 23

క॥ హిందీ హూణాంధ్రోర్దుల
నందముగ పఠింపనేర్చి యాంధ్ర కవిత్వం
బందున అర్ధగణాంకము
లందున నిపుణుఁడయి కేశవాఖ్యుండలరెన్॥ 24

ఆ॥వె॥ అరయ నాంగ్ల భాషయందు బి.ఏ. పట్ట
భద్రుఁడై తెలుంగు బాసయందు
కవి యనన్ దనర్చి ఘన ప్రభుత్వోద్యోగ
మెనసె కేశవాఖ్య నెన్నఁ దరమె॥ 25

క॥ పరికింప రామలింగే
శ్వర తారావళియు నటులె శ్రావ్యముగా బల్
సరసముగ రాజ రాజే
శ్వర శతకంబును రచించి ప్రకటించె భళా॥ 26

క॥ మరికొన్ని యముద్రితముగ
స్వరచిత గ్రంథములు గలవు చర్చింపనికన్
మరియెన్ని గ్రంథములు తా
విరచించునొ కేశవయ కవిప్రవరుఁడహా! 27

ఉ॥ చారు పదాంచితంబునయి శ్రావ్యమునై రసవత్తరంబునై
సూరి మనోహరంబునయి శుంభ దలంకరణాన్వితంబునై
భూరి సలక్షణంబునయి పొల్చెడుకైత గలట్టి కేశవా
చారికి చెల్లునంచును "రసప్రియ" యన్ బిరుదంబు నిచ్చితిన్॥ 28

ఆ॥వె॥ గురుని యందు భక్తి కోవిద కవులందు
ప్రీతి యనుజ మాతృ పితరులందు
దయ గలాడు త్రాత దాత శ్రీ కేశవా
చారి సుగుణరాశి యౌర తలఁప॥ 29

ద్విప్రాసము :

కII వీడఁడు శమమున్ దమమున్
వేడఁడు హరిహరుల దక్క వేఱొక వేల్పున్
గూడఁడు దురితాత్ముల నెపుఁ
డాడఁడు కల్లలను కేశవాచారి సుడీII 30

కII కంతు నిశాకాంతుని శ్రీ
మంతుని సంతును వసంతు మంతు జయంతున్
పంతు నలున్ సొగసున న
త్యంతము మించుఁ గద కేశవాచారి భళాII 31

సీII చెలువల వలపించు సలలితాకృతియు నా
యాకృతికిని తగు నాంగ్ల విద్య
విద్యకు తగిన సదుద్యోగ వృత్తియు
వృత్తికి తగినంత విత్తగరిమ
విత్తంబునకు తగు వినయ గుణంబును
వినయంబునకు తగు వితరణంబు
వితరణతకు దగు విమలమౌ కీర్తియు
కీర్తికి తగిన ప్రవర్తనంబు
గీII ఇన్ని సుగుణంబులను గూర్చి యితని నంబు
జాసనుడు ధాత్రి సృష్టించె ననుచు దోచు
గాన కులపావనుండనగా నెసంగు
చున్న శ్రీ కేశవాచారి నెన్నఁ దరమెII 32

గీII అట్టి శ్రీ కేశవాచారి యాంధ్ర రాష్ట్ర
ముఖ్యపట్టణముననను ప్రభుత్వమందు
నుత్తమోద్యోగమును జేయుచున్న వేళ
నేగి నపుడెల్ల తన చెంతనే వసింతుII 33

త్రిపాసము :

కII తోషించును భక్తిన్నను
భూషించును మత్ప్రబంధముల నెంతయు న
న్వేషించును ప్రియమలరగ
భాషించును కేశవ ప్రవరుఁడిటు నాతోన్II 34

మII వనపర్తి ప్రభుఁడేము వర్తిలు పురిన్ ప్రత్యబ్దమున్ రంగనా
థుని దివ్యోత్సవ మాచరింపుచు కవిస్తోమంబు నెంతే ప్రియం
బున సత్కారము జేయుచుండుటను తామున్ వార్షికంబూన వ
చ్చిన వేళన్ సముజేరి యుందువు కదా! శ్రీ లొంద విద్వత్కవీII 35

గీII మూడు పురుషాంతరముల భూపులను మఱియు
మూడు తరముల మమ్ము సమ్మోద మెలర్పఁ
జేయ నేటేట వచ్చు నీ చెల్వమెన్న
నగునె కాశీపతి కవీంద్ర! సుగుణ సాంద్ర! 36

కII దాతయయిన గద్వాల
క్ష్మాతల నాథునకు కృతులొసంగిన నిను నా
తాతకు సముఁడని వేడితి
ప్రీతిగ నా కోర్కె విన్నవింతును వినుమాII 37

కII చనువున నా పినతండ్రికి
మును గౌరీనాథ శతకమును కృతినిడి కీ
ర్తిని వెలయించితి వటు నా
కును కీర్తి రహింప కృతిని కూరిమి నిడుమాII 38

సీII త్వత్కృత కృతులలోపలి మేలి కృతులంది
నిను సత్కరించిన ఘనులు గాన
గద్వాల ఱేఁడునాఁ గ్రాలు సీతారామ
నృపునకు హాలహర్వీశుఁడైన

హనుమంతరెడ్డి వర్యునకు జిల్లెళ్ల వీ
రబ్రహ్మముఖుల కారయగ దమకు
కీర్తిభాసిల్లఁ దత్కృతులందు గల చమ
త్కృతి పద్యములు గూర్చి తీర్చిదిద్ది

గీ॥ తివిరి కాశీపతి చమత్కృతి యను పేర
ఖండ కావ్యముగా వ్రాసి కరుణఁ దొలుత
నెసగ మద్వంశ కథ రచియించి చేర్చి
యిడిన ముద్రింపఁజేసి నీ కొడమె నిడుదు॥ 39

గీ॥ అస్మ దన్వయ కథను మదంకితంబు
పరగ జేయుము నేకృతి భర్తనగుదు
నితరు లెనసిన త్వచ్చమత్కృతి రచనలు
క్షమ వెలువరింతు ప్రకటన కర్త నగుదు॥ 40

క॥ కనుగొన కృతి భర్తను ప్రక
టన కర్తనుగా దనర్చుటన్ మీవలె నే
ఘన కీర్తిగాంతు నని నా
మనమునకున్ దోచె నాదు మనవిని గొనుమా॥ 41

క॥ ఈశార్చాధుర్యుడవు కు
శేశయ భవ తులిత మతివి చిత్రోదర బం
ధాచ కవితాగ్రణివి కద!
కాశీపతి కవివరేణ్యా! ఘనతర పుణ్యా! 42

క॥ సముచితముగ నరువది గ్రం
థములను రచియించినట్టి ధన్యుఁడ వగుటన్
తమ కీర్తి నిండెగద వి
శ్వము కాశీపతి కవీంద్ర! సద్గుణ సాంద్రా! 43

సీ॥ హృద్య నిరోష్ఠ్య నిర్గద్య శుద్ధాంధ్ర రా
ట్కథ రచించిన మహాకవివి నీవు
మూడర్థముల కావ్యమును రచియించి ప్ర
ఖ్యాతి గాంచిన మహాకవివి నీవు
ముప్పదర్థముల నొప్పుచునుండు పద్య మొ
క్కటి రచించిన మహాకవివి నీవు
పదియక్షరముల కబ్బము రచియించి ప్రా
జ్ఞతను జూపిన మహాకవివి నీవు

గీ॥ పిల్ల భాగవత మన శోభిల్లు నటుల
సిద్ధ యోగి చరిత్ర రచించినట్టి
కలుష రహితుండవగు మహాకవివి నీవు
క్షితిని నిన్నెన్నఁ దరమె కాశీపతీంద్ర॥ 44

సీ॥ ఆక్రమించితివి భవ్యాస్థాన కవి పీఠి
ప్రభు ననుమతిని గద్వాల ప్రోల
సాగించుకొంటి వూరేగింపు నేన్గుపై
బుధు లందె నిడ నొంది ప్రొద్దుటూరఁ
గావించుకొంటివి కనకాభిషేకమున్
హనుమంతరెడ్డిచే హాల హర్వఁ
బట్టించుకొంటివి బ్రహ్మరథంబును
శిల్పకోవిదులచే సిద్ధిపేట

గీ॥ నఖిల భారత కాంగ్రెసధ్యక్షు చేత
♦రాష్ట్రపతి చేత ఢిల్లి పురంబునందు
బిరుద సత్కారములనొంది పేరుగాంచి
తివి సుగుణ సాంద్ర కాశీపతి కవి చంద్ర॥ 45

♦ డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ

క॥ క్ష్మాపులు గల తఱి నానా
భూపుల చెంత నవధానములొనర్చియు సం
దీపింప స్వర్ణపతకము
లాపయి ధన బిరుద వార్షి కాదు లెనసి తా॥ 46

క॥ నా నా రాజులచే స
న్మానము లొందుటయెగాక మన రాష్ట్రమునన్
జానొందు జగద్గురువుల
చే నయతర వార్షికములు చేకొంటి వహా॥ 47

క॥ తమ రూరేగని ఘన వా
హ్యము లెవ్వియు లేవు మఱియు నవయవములకున్
తమ రెనయని బిరుదాభర
ణము లెవ్వియు లేవు కద కనత్కవి సింహా॥ 48

గీ॥ మొనసి త్వద్గ్రంథ తతి చిత్రములగు రచన
లొక్కచో గూర్చి వహి రూపు నొందఁజేయ
చిత్ర కవితా ప్రసంగంబు జేయు వారి
కెంతొ యుపయుక్తమగును గాదే కవీంద్ర॥ 49

గీ॥ కాన తామివ్విధంబున గ్రంథమిడిన
కాన నే నివ్విధంబున గ్రంథమిడుదు
మేలిమిన్ సత్కృతిగ గొనుమీ యటుంచు
మేలిమిన్ సత్కృతిగను తాంబూల మొసగె॥ 50

గీ॥ అందునన్ మత్కృత గ్రంథ బృంద మరసి
ఏర్చి తగు పద్యములు గూర్చి తీర్చిదిద్ది
తెలియ "కాశీపతి చమత్కృతి" యను పేర
కేశవాచారి కీ ఖండ కృతి నొసఁగితి॥ 51

—: ప్రజాభిప్రాయము :—

క॥ కాశీపత్యవధాని మ
హాశయుఁ డీ కావ్య జనకుఁడట ఫోతేదార్
కేశవ కవి యీ కావ్య ప్ర
కాశకుఁడట వెలయదే? యికన్ గ్రంథ మిలన్॥ 52

# శ్రీ కాశీపతి చమత్కృతి

—: ప్రారంభము :—

నిష్కేవలస్వర నిష్పంచవర్గ నిర్బిందు నిర్గద్య
దశాక్షరీయమైన నా "శౌరి శైశవ లీల" నుండి
అర్థాష్టక స్తవ పద్యరత్నము (దీనిని ముక్కులు మూసి చదువవచ్చును)

ఆ॥వె॥ శ్రీ రలొసవి యేల వే రావె శివ రసా
వాల యార్య వివర లోల వహి వి
హార శ్రీ వరాహ్వ యసురాస్యహారి యీ
సేవ లెలయవే! విశేష హేల ॥

## 1 శివ స్తవము

టీ॥ శ్రీ+ఇరల = శ్రీరలన్ = ఐశ్వర్య భూముల, ఒసవి యేలవే=ఇచ్చి పాలింపుమా, రావె శివ=ఓ శివుడా! రాగదే, రసావాల=జలము నకుకు దురైనవాడా, (గంగాధరుడైనందుననుట), ఆర్య=ఓ పూజ్యుడా!, వివర=రంధ్రములలో (పుట్టబొఱియలలో ననుట), లోలవహి=చలనము వహించిన నాగమును, విహార=అతిశయించిన హారముగా గలవాడా!, అసుర=రాక్షసుల, ఆస్య=ఉనికి పట్టులను (త్రిపురముల ననుట), హారి=హరించినవాడా!, శ్రీ వర=పార్వతీ వల్లభుడు అను శ్రేష్ఠమైన, ఆహ్వ=పేరు గలవాడా!, (శ్రీ యనగ లక్ష్మీ పార్వతీ సరస్వతులకు చెల్లునని గ్రహించునది), విశేష హేలన్=మిక్కిలి సంతోషముతో, ఈ సేవలెలయవె=నా యీ స్తోత్రములను పొందవే!.

## 2 పార్వతీ స్తవము

టీ॥ శ్రీరలొసవి యేలన్=బుద్ధిని భాషల నిచ్చి పాలించుటకు, వేరావె=శీఘ్రముగా రాగదే, శివ=శివ నామముగల దానా! రసావాల=భూమికి కుదురైనదానా (జగము తల్లి యైనందు ననుట), ఆర్య=ఆర్యా నామము గల దానా! (శివా, ఆర్యా నామములు పార్వతికి చెల్లుననుటకు–శివా భవాని రుద్రాణి అనియు, ఆర్యా దాక్షాయణీ చైవ అని అమరము) వివర=మిక్కిలి శ్రేష్ఠమైన, లోలవహి=చలనమును వహించిన (నడవడి ననుట), విహార=సంచారముగల దానా! (సర్వమంగళ యైనందువననుట), లేదా, (వివర=కొండబొఱియలలో ననుట), లోలవహి=చలించు చుండు సింహము వలని, విహార=సంచారము గల దానా! (సింహ వాహనము గలదియైనందుననుట) శ్రీ=పార్వతి యను, వరాహ్వా=మంచి పేరు గల దానా!, అసురాస్య=రాక్షస ముఖ్యులను (మహిషాసురా దుల ననుట), హారి=హరించిన దానా!, అధికానందముతో నా యీ స్తుతుల నందుకొనుము

## 3 విష్ణు స్తవము

టీ॥ శ్రీరలన్ (శ్రీ+ఇరలన్)=సంపద్భాగ్యములను, ఒసవి=ఇచ్చి, ఏలన్=పాలించుటకు, వేరావె=శీఘ్రముగా రాగదే!, శివ=శుభకరమైన, రసా=భూమికి, ఆవాల=కుదురైనవాడా (విశ్వంభరుడైనందుననుట), ఆర్య=ఓ పూజ్యుడా! వి=పక్షులకు, వర=ప్రభుడగు గరుడుని, లోలవహి=చలనము ను వహించిన, విహార=సంచారము గల వాడా (గరుడ వాహను డైనందుననుట), శ్రీవర=లక్ష్మీ వల్లభుడను, అహ్వా=పేరు గల వాడా!, అసురాస్య=రాక్షస ముఖ్యులను, హారి=హరించినవాడా!, విశేష హేలన్=మిక్కిలి సంతసముతో, ఈ సేవలెలయవే=నా స్తోత్ర ములను పొందుము. (రావే, కావవే, ప్రోవవే, వరద యని భాగవతమున పోతరాజు వెన్ను నన్నాడు కావున ఎలయవే యనుట ఉచితమే యని గ్రహించునది.)

## 4 లక్ష్మీ స్తవము

టీ॥ శ్రీరలొసవి యేలన్ = సంపద్భూముల నిచ్చి పాలించుటకు, వే రావె = శీఘ్రముగా రాగదే, శివరసావాల = శుభకరమైన భూమికి కుదురైన దానా (ధనమూల మిదం జగత్తన్నందుననుట), అర్య = ఓ పూజ్యురాలా! (లోకమాత యైనందుననుట). వివరలోలవహి విహార = (లక్ష్మీదేవి వాహనము ఉలూకమనుట నిచటస్మరింపఁబడెను), గరుడుని చలనమును వహించిన సంచారము గల దానా, (భార్యాభర్తలకొకే వాహనమైనందున ననుట), శ్రీ = లక్ష్మీయును, వరాహ్వాయ = శ్రేష్ఠమైన పేరు గల దానా! సురా = దేవతా స్త్రీలలో, ఆస్య = ముఖమువలె, (ముఖ్యురాలవై యనుట), హారి = మనో హరమైనదానా, మిక్కిలి సంతోషముతో నా యీ స్తోత్రము లను పొందుమా!

## 5 బ్రహ్మ స్తవము

టీ॥ (శ్రీ + ఇరల) శ్రీరలన్ = శోభాయుక్తములగు వాక్యములను, ఒసవి = ఇచ్చి ఏలన్ = పాలించుటకు, వేరావె = శీఘ్రముగా రాగదే!, శివరసావాల = వేదా మృతమునకు పాదైనవాడా! (వేద నిర్మాత యైనందుననుట), వివర = పక్షిశ్రేష్ఠముయొక్క, లోలవహి = చలనమువహించిన, విహార = సంచారము గల వాడా! (హంస వాహనుడైనందుననుట), శ్రీ వరాహ్వాయ = సరస్వతీ వల్లభుడను పేరు గలవాడా! సురాస్య = దేవతాముఖ్యులలో, హారి = మనో హరుడవైనవాడా! (సురజ్యేష్ఠుడైనందుననుట), అతిమోదముతో నా యీ స్తవములను గైకొనుమా!

## 6 సరస్వతీ స్తవము

టీ: (శ్రీ + ఇరల) శ్రీరలన్ = అమృతము వంటి పలుకులను, ఒసవి = ఇచ్చి, (పలుకుల వెలందియైనందున ననుట), ఏలన్ = పాలించుటకు, వే రావె = శీఘ్రముగా రాగదే! శివరసావాల = శుభమైన యనురాగమునకు కుదురైన దానా! ఆర్య = ఓ పూజ్యురాలా, వివరలోల వహి విహార = పక్షిశ్రేష్ఠము యొక్క చలనము వహించిన సంచారము గలదానా! (కొన్నింట సరస్వతికి మయూర వాహనము గూడ కలదు), (భార్యా భర్తల కొకే వాహనమైనందున ననుట), శ్రీ వరాహ్వయ = సరస్వతి యను శ్రేష్ఠ నామము గల దానా! అత్యంతామోదముతో నా యీ సేవల నందుకొన గదే!

## 7 వినాయక స్తవము

టీ: శ్రీరలొసవి యేలన్ = అలంకార యుక్తములగువాక్యముల నొసంగి యేలుటకు, వేరావె = వేగముగా రాగదే. శివరసావాల = శివుని ప్రేమకు కుదురైన వాడా!, వివర = రంధ్రములలో (నేల బొఱియలలో ననుట) లోలవహి = చలనము వహించెడు నెలుకల వలని, విహార = సంచారముగల వాడా (మూషక వాహను డయినందున ననుట), లేక, వివర = వినాయకుడా! లోల వహి విహార = చలనము వహించిన సంచారము గలవాడా (గజ ముఖుడైనందున నేనుగు తల నెప్పు డటు నిటు త్రిప్పుచు విహరించును గాన నట్టివాడా యనుట), శ్రీ = శోభా సమేతమైన, వరాహ్వ = మంచి పేరు గలవాడా!, అసురాస్య = గజాసురుడను నేనుగు మొగముచే, హారి = మనోహరమైన వాడా! మిక్కిలి ముదముతో నా యీ వినతులను చేకొనుమా!

# 8 శ్రీనాథ కవీశ్వర స్తవము

టీ॥ శ్రీరలొసవి యేలన్ = అలంకారములగు వాక్యముల నొసంగి యేలుటకు, వేరావె = శీఘ్రముగా రాగదే! శివరసావాల = శుభకరములైన శృంగారాది రసములకు పాదైనవాడా! అర్య = పూజ్యుడవైనవాడా! (కనకాభిషేకాది పూజనీయమైన గౌరవము పొందినందున ననుట), వివర = అతిశయ ప్రభుడవైనవాడా (కవి సార్వభౌముడై నందున ననుట), లోలవహి విహార = సంచలనము నొందిన సంచారము గలవాడా (బహుదేశములు విహరించిన వాడై నందున ననుట), శ్రీవర = శ్రీనాథుడను, అహ్వాయ = నామము గల వాడా, సుర = దేవతలకు, అస్య = ఉనికి పట్టైన స్వర్గమందున, హారి = మనోహరమైన వాడా. (స్వర్గమందున నొప్పారుచుండిన వాడా యనుట). అత్యానందముతో నా యీ స్తవముల నందుకొనుమా!

ఈ కవి యన్నప్పుడన్నను పల్నాటి వీరచరిత్రము నతి మనోజ్ఞముగ రచియించినందునను, నేను పల్నాట జనించిన వాడనై నందునను, నేనంతవాడను గాకపోయినను తాను రెడ్డి ప్రభువుల ఆస్థాన కవియైనందునను, నేను రెడ్డి ప్రభువుల ఆస్థాన కవినైనందునను, తాను శృంగార నైషధాది బహు గ్రంథ కర్తయైనందునను, నేను సారంగధరీయంబను త్ర్యర్థి కావ్యాది బహుగ్రంథకర్తనైనందునను, యిరువురము కనకాభిషేకము లొందిన వారమైనందునను, మఱియు తాను శృంగార ప్రియుడై నందునను, కథానాయకుడగు శ్రీకృష్ణుడు శృంగారప్రియుడైనందునను, శ్రీ వరాహ్వాయ శబ్దము శ్రీనాథ నామమునను రూఢిగా నన్వయించుట చేతను. నేనీ కవిని పేర్కొంటిని పల్నాటి వీరచరిత్రము రచించిన శ్రీనాథుడును శృంగార నైషధము రచించిన శ్రీనాథుడును వేర్వేరు శ్రీనాథులను నొక వాదము లేకపోలేదు. కాని యటులైనను నా కా యిరువురును పేర్కొనదగిన వారేయని గ్రహించునది.

## నా "సిద్ధ యోగి చరిత్ర" నుండి

ఆ॥వె॥ క్షితిని గ్రంథ తతిని సృష్టింప వెలయింపఁ
బెంపఁ గర్తలనియు విబుధులనియు
పరమ కవులనంగ వాక్యాసనునిఁక శ్రీ
నాథు రుద్రుఁదలతు నాదు మదిని॥

ఈ పద్యము త్రిమూర్తులగు దేవతల పరముగను, ప్రసిద్ధులగు ముగ్గురు కవుల పరముగను అర్థద్వయము గల్గునట్లు చెప్పబడినదని గ్రహింపవలెను.

త్రిమూర్తులైన దేవతల పరముగ ;

టీ॥ క్షితిని = భూమిని, సృష్టింపన్ = కల్పించుటకును, వెలయింపన్ = ప్రకాశింప జేయుటకును. పెంపన్ = హరించుటకును, కర్తలనియు = కారకులనియును, విబుధులనియున్ = దేవతలనియును, గ్రంథతతిని = గ్రంథ సముదయమున, పరమకవులనఁగన్ = శ్రేష్ఠులైన కవులు చెప్పగా, వాక్యాసనుని = బ్రహ్మదేవుని ఇఁకన్ = మరియును, శ్రీనాథున్ = విష్ణువును, రుద్రున్ = ఈశ్వరుని, నాదుమదిని = నా హృదయమునందు, తలఁతున్ = ధ్యానింతున్, (సృష్టి స్థితి లయకర్తలగు త్రిమూర్తులనుట)

కవుల పరముగ ;

టీ॥ క్షితిని = భూమిపైన, గ్రంథతతిని = గ్రంథ సముదాయమును, సృష్టింపన్ = నిర్మించుటకును, వెలయింపన్ = ప్రకాశింపజేయుటకును, పెంపన్ = వృద్ధిపొందించుటకును, కర్తలనియున్ = కారకులనియును, పరమ కవులనంగన్ = శ్రేష్ఠులయిన కవులనంగను, వాక్యాసనుని = నన్నయార్యుని ఇఁక = మరియును, శ్రీనాథున్ = శ్రీనాథ కవిని, రుద్రున్ = కందుకూరి రుద్రకవిని, నాదు మదిని = నా హృదయమున, తలఁతున్ = ధ్యానింతును

## నా 'సారంగధరీయము' నుండి

### కుకవి నిరసనము

చ॥ సరసుల దూరుచుండఁగను సార్థకమౌ నొకొ మంచివారిలో
దురుసుగ భంగమొందుట యధోగతిఁజెందుట పంకమందుటల్
ధర సుముఖుండొకండయినఁ దద్గతి గాంచిన నవ్వకుండునే?
విరసమె గాక దుష్కవి కవిత్వము వీనులకెట్లు సొంపగున్॥

ఈ పద్యములో "దుష్కవి కవిత్వము వీనులకెట్లు సొంపగున్" అనుటచే చెడు కవుల కవిత్వము చెవులకు సొంపుగా నేరదనియు, చెడు జలపక్షులయొక్క జలపక్షిత్వము గరుడ పక్షులకు సొంపు గానేరదనియును అర్థద్వయము గలదు.

టీ॥ సరసులఁ దూరుచుండగను సార్థక మౌనొకొ=బుద్ధిమంతులను నిందించు చుండగనే ప్రయోజనమగునే అని కుకవుల పరముగను, కొలనులయందుఁ జొరబాఱినంతనె ప్రయోజన మౌనే అని జలపక్షుల పరముగను, మంచి వారిలో దురుసుగ భంగమందుట=సజ్జనులలో కఠినముగా భంగపాటు నొందుటయును అనియును, మంచి జలములో కర్కశముగా తరగల నొందుటయును అనియును, అధోగతి జెందుట=అధమస్థితిని బొందుట అనియును, అడుగు బట్టుట అనియును, పంకమందుటల్ = పాపము బొందుటలు అనియును, బురదనొందుటలు అనియును, ధరన్=భూమి యందు, తద్గతి గాంచినన్ = ఆ కుకవుల యొక్క నడవడిన్ గనిన నని యును, ఆ చెడు జలపక్షుల యొక్క స్థితిని గాంచిన ననియును, సుము ఖుండొకండయినన్=ఒక్క పండితుఁడైనను అనియును, ఒక్క సుము ఖుఁడైనను (అనగా గరుడుని కుమారుడగు నొక్క సుముఖుడైనను) అని యును, నవ్వకుండునే=హసియింపకుండునా (అనగా హసియించు ననుట) విరసమెగాక=రసవిహీనమే తప్ప, దుష్కవిత్వము, వీనులకెట్లు సొంప

గున్ = చెడుకవి యొక్క కవనము చెవులకు నెట్లు ఇంపగును (అనగా కాదనుట) దుర్ + కవి–దుష్కవి = చెడుగగు కః = జల సంబంధమగు వి = పక్షియొక్క, కవిత్వము = జలపక్షిత్వము, వి + ఇనులు – వీనులు = వి = పక్షుల యొక్క, ఇనులకు = ప్రభువులకు (అనగా గరుడ పక్షులకనుట). ఎట్లు పొసంగున్ = ఎట్లు సొంపు కాగలదు (అనగా కానేరదనుట).

ని : "భంగ స్తరంగే రుగ్భేదే భేదే జయ విపర్యయే"॥ విశ్వము

ని : "వాద్వారిసలిలం కమలం జలం వనం"॥ అమరము.

ని : పంకః కర్దమ పాపయోః॥ అనియును,

ని : సుముఖస్తార్క్ష్యతనయే, ఫణి భేదేచ పండితె॥ అని విశ్వము.

(కం॥ కవి యల్లసాని పెద్దన
కవి తిక్కన సోమయాజి గణుతింపంగా
కవి నేను రామకృష్ణుఁడ
కవి యను శబ్దంబు నీటి కాకికి లేచే!
అను పద్యమిట స్మర్యామి.)

ఉ॥ అచ్చుగఁ బూర్వసత్కవుల యట్లు చమత్కృతి కావ్యమున్ బుధుల్
మెచ్చ రచించినాఁడ నను మించ రచించిన వారికేన్విడెం
బిచ్చి నమస్కరింతు రచియింపఁగ జాలక నన్ను దూరినన్
రచ్చనఁ బండితాళి పదరక్ష గ్రహించియు బుద్ధిచెప్పరే!

## నా "సారంగధరీయము" నుండి

### షష్ఠ్యంతములు

(వృత్త్యనుప్రాసలు)

క॥ కామాదృతి వామాతతి
కామాకృతి ధామధృతికి, ఖల సంహృతికిన్
కోమల వచనామల రచ
నా మలయజ శీతలునకు, నయకలితునకున్॥

టీ॥ కామాదృతి = కామమందు నాదరము గల, వామాతతి = స్త్రీ సముదాయము నకు, కామాకృతి = మన్మథ స్వరూపమువంటి, ధామధృతికిన్ = శరీరము ధరించిన వానికిని, ఖలసంహృతికిన్ = దుష్టసంహారము గలవానికిని, కోమల వచన = మృదు వచనముల యొక్క, అమల రచనా = కల్మషరహితమగు నిర్మాణమునందు, మలయాజ = చందనము వంటి, శీతలునకు = చల్లదనము గలవానికిని. నయకలితునకున్ = నీతితో గూడుకొన్న వానికిని—

కం॥ భీమారవ నేమాహవ
సీమాభవ ధామధృతికి, శ్రీసుత సఖ సు
త్రామాత్మజ సోమాత్మజ
సోమాత్మజ నల విలాస, శోభాకృతికిన్॥

టీ॥ భీమారవ నేమ = భయంకర ధ్వనులు-నియమముగా గల, ఆహవ సీమ = రణరంగప్రదేశమందు, అభవధామ ధృతికిన్ = ఈశ్వర ప్రభావమును ధరించిన వానికిని, శ్రీసుత = మన్మథుని యొక్క, సఖ = చెలికాడగు వసంతుని వంటివానికిని, సుత్రామాత్మజ = ఇంద్రనందనుడగు జయంతుని వంటి వానికిని, సోమాత్మజ = కుబేరనందనుడగు నలకూబరుని వంటివానికిని, సోమ = చంద్రుని వంటియు, ఆత్మజ = మన్మథుని వంటివానికిని, నల = నలరాజువంటి వానికిని, విలాస శోభ = శృంగారకాంతులు గల, ఆకృతికిన్ = స్వరూపముగల వానికిని.

ని : సోమః కుబేరే పితృదేవతాయాం వసుప్రభేదేచ సుధాకరేచ॥
అనివిశ్వము.

క॥ నారద శరపారద హర
శారద వరనీరద దర, సమకీర్తికి వి
స్తార దయాపార నయా
చార చయాధారమతికి, సద్బుధతతికిన్॥

టీ॥ నారద=దేవమునియగు నారదునితో, శర=జెల్లుతో, పారద=పాదరసముతో, హర=ఈశ్వరునితో, శారద వర నీరద=శరత్కాలమందలి శ్రేష్ఠమగు మేఘముతో, దర=శంఖముతో, సమ=సాటియగు, కీర్తికిన్=యశము గలవానికి, అనగా పైన చెప్పబడిన నారదాదుల కాంతివలె తెల్లని కీర్తి గలవాడని భావము, విస్తారదయా= విశేషమైన కరుణకు, అపారనయ=మేరలేని నీతికి, ఆచారచయ=ప్రవర్తనానీకమునకు, ఆధారమతికిన్=ఆదరువైన హృదయముఁ గలవానికిని, సద్బుధతతికిన్ = మంచి పండితులయొక్క సముదాయముఁగలవానికిని—

## నా "సిద్ధయోగి చరిత్ర" నుండి
## షష్ఠ్యంతములు
(అంత్యప్రాసలు)

క॥ ధీరునకున్ సుగుణాలం
కారున కతులిత పరోప కారునకు సదా
చారునకు సూన బాణా
కారునకున్ వాహినీశ గంభీరునకున్॥

క॥ దాంతునకున్ నిర్మల సు
స్వాంతునకున్ దనవ నవ వసంతునకున్ శ్రీ
మంతున కనుపమ సమధిక
శాంతునకున్ కీర్తి విజిత సత్కాంతునకున్॥
(సుగమము)

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధి యగునట్లుగా నేనొర్పంబూనిన కాశీపతి చమత్కృతి యను ఖండ కావ్యమును ప్రారంభింపఁ బోవునెడ.

కేశవాచారి : కవి శిఖామణీ! చిత్ర కావ్యములయందు రసము అల్పముగ నుండునని కొందరందురే! అందుకు మీ అభిప్రాయమేమి?

కాశీపత్యవధాని : రసప్రియా! మీరడుగవలసిన ప్రశ్నయే యడిగితిరి, నా సారంగధరీయమున నిట్లంటిని.

శా॥ ఆద్యాశ్వాసము వెంట నిందలి చతుర్థాశ్వాసమున్ తొల్లిటన్
హృద్యంబౌ గతివ్రాసి మూడు కథలెంతే యుక్తితో గూర్చి నా
విద్యాకౌశలమందు జూపుటకునై వీలేమియున్ లేమిచే
నాద్యంతమ్ముల మధ్యభాగమున రెండాశ్వాసముల్ బెంచితిన్॥

గీ॥ త్ర్యర్థి కావ్యంబుగాన కథాంతరమున
వివిధ రసములు పొందింప వీలుగాక
తనివి దీరక కావ్యపద్ధతిని వర్ణ
నములఁ బెంచి చమత్కృతి నడిపినాఁడ॥

క॥ పరికింపఁగను సుభద్రా
పరిణయమును బోలు మత్కవనము నృపాలా
దరమై సద్విబుధ మనో
హరమై కుకవి ప్రతాపహరమై స్థిరమై॥

అనగా చేమకూర వేంకటకవి సుభద్రా పరిణయమను నామాంతరముగల "విజయ విలాసము"ను, కాణాద పెద్దనకవి భద్రాపరిణయమను నామాంతరము గల "ముకుంద విలాసము"ను నా కభిమాన ప్రబంధములు. అందలి చమత్కారముల ననుకరించి ప్రతిపద్యమునకు నట్టియలంకారములతో ఆ శబ్దములను తీసికొనక నూతన శబ్దములఁ గనుగొని పూర్తిచేయుటయేఁగాక నూతనముగా కొన్ని శబ్దాలంకారములను కనిపెట్టి రచించితిని, అందుకని యిప్పుడిట్లను చున్నాఁడను.

క॥ పొందుగను త్ర్యర్థి కావ్యము
నందును మధ్యన్ దనర్చు నాశ్వాస యుగం
బందున నించిన రసమున్
బిందెలకున్ బట్టి త్రాగి త్రేవన రాదే!

నేను రచించిన సనాతనాధునా తనాలంకారము లెయ్యవి యన నా "సారంగధరీయము" న—

## —: స్త్రీ వర్ణన :—

క॥ ప్రభవానంద శ్రీముఖ
విభవాక్షయ చిత్రభాను విక్రమ జయమున్
శుభకృద్భావ యగుట నా
యిభగమన గుణములనెన్న నేండ్లా నొకో॥

టీ॥ ప్రభవ=జనించినట్టి, ఆనందశ్రీ=సంతోష సంపద, ముఖ=మొదలైన, విభవ = వైభవముల యందున, అక్షయ = నాశనము లేనిదియును, చిత్ర=ఆశ్చర్యమైనదియును, భాను=కాంతియును, విక్రమ=పరాక్రమమును, జయయున్=జయములు గలదియును, శుభకృత్=మంగళములు గలుగజేయు, భావ=హృదయము గలదియును, అగుటన్=అయినందువే, ఆ యిభగమన గుణముల నెన్నన్ = ఆ గజగామిని గుణముల నెంచగా, ఏండ్లానొకో=సంవత్సరములు పట్టునేమొ, అని స్వభావార్థము.

ఇక ప్రభవ, ఆనంద, శ్రీముఖ, విభవ, అక్షయ, చిత్రభాను, విక్రమ, విజయ, శుభకృత్, భావ అను వత్సర నామములు ధ్వనించు గుణ విశేషముల గుట వలన నా గజయాన గుణములనెంచి చూడగా వత్సరములగు నేమొయని విశేషార్థము.

ఏండ్లానొకో యనుట యిందలి సమర్థన.

గీ॥ బొమల కేకాదశి సమానముగను రామి
నవమి యిరువైపులన్ వచ్చినన్ శ్రుతులకుఁ
బ్రతిన గాదాయె నొకఁడునౌ పాడ్యమి యిఁక
నతివ నుదుటికి తలక్రిందులైన సరియె॥

టీ: బొమలకున్ = ఆ చేడియ కనుబొమ్మలకు, ఏకాదశి = పదనొకండవ తిథి (అనగా ౧౧ ఈ స్వరూపముతో నుండునది) సమానముగను రామి = సరి రాకపోవుట వలన, నవమి = తొమ్మిదవ తిథి (అనగా ౯ ఈ స్వరూప ముతో నుండునది), యిరువైపులన్ వచ్చినన్ = రెండు వైపులవచ్చినప్ప టికిని, శ్రుతులకున్ = ఆ యువతి చెవులకు, ప్రతిన గాదాయెన్ = సమానము గాక పోయెను, ఇఁకన్ = ఇంకను, ఒకడు నౌ పాడ్యమి = ఏక సంఖ్యాక మైన మొదటి తిథి (అనగా ౧ ఈ స్వరూపముతో నుండునది), అతివ నుదుటికిన్ = ఆ చేడియ నొసలునకు. తలక్రిందులైనన్ = మీదు క్రిందైన ప్పటికిని, సరియె = సమానమగునా (కాదనుట), అనగా స్త్రీల కనుబొమ్మ లకు పదనొకండవ సంఖ్యయును, చెవులకు తొమ్మిదవ సంఖ్యయును, నుదుటికి బాలచంద్రుని బోల్చుటవలన నట్టి బాలచంద్ర రేఖాకృతి గల ఒకటవ సంఖ్య నుపమానముగా గైకొనబడినదనియు గ్రహించునది.

గీ॥ కలికి ముఖమును వర్ణింపగా నెలయగు
నతివ కురులెన్నగా నొక్క యబ్దమగును
నెలత కనుగవ తీవి వర్ణింప నెంత
యుత్తమునకైన యనిమిష యుగము గాదె॥ ( కాలకన్య )

టీ॥ కలికి ముఖమును వర్ణింపగాన్ = ఆ చేడియ మోమును వర్ణింపగా, నెలయ గున్ = మాసము దినములగుననియు, చంద్రుడగుననియును భావము. అతివ కురులెన్నగాన్ = ఆ తొయ్యలి శిరోజముల వర్ణింపగా, ఒక్కయ బ్దమగును = ఒక వత్సరమగుననియు, ఒక మేఘమగుననియు భావము, నెలత కనుగవ తీవి వర్ణింపన్ = ఆ పొలతి కనుదోయినీటు వర్ణింపగా, ఎంత ఉత్తమునకైనన్ = ఎంతటి శ్రేష్ఠునకైనను, అనిమిష యుగము గాదే = దేవతాయుగము కాదా యనియు, చేపల జంట కాదాయనియు భావము.

నెల యనిన మాసమునకు, చంద్రునకున్ చెల్లుననుటకు "నెలకు జాబిల్లి కౌ నెలయనంగ" యని సాంబ నిఘంటువు అబ్దమనిన సంవత్సరమునకు, మేఘ మునకు చెల్లుననుటకు ని. "అబ్ద సంవత్సరే మేఘే" అని విశ్వము. అనిమిషల నిన దేవతలకును, చేపలకును, చెల్లుననుటకు ని: "అనమేషశ్చానిమిషోఽ ప్యేతా ద్వ్యసుర మత్స్యయోః" అని నానార్థ రత్నమాల, యుగమనిన యుగము నకును, జంటకును చెల్లుననుటకు ని: "యుగం యుగ్మేకృతాదిషు" అని అమరము. ప్రమాణములు

గీ॥ కోమలాంగి సుగుణములు కోటియగును
కొమ్మ రదనాళియో శతకోటి యగును
సుదతి కటిసీమ యందుమా క్షోణియగును
పల్కు బల్కిన నికనెంత పైకమగునొ॥

టీ॥ కోమలాంగి=ఆచేడియ యొక్క, సుగుణములు=మంచి గుణములు, కోటి యగును=కోటి నాణెములగునని యర్థము, అతిశయమగునని భావము. ని: "కోటీరశ్రౌ చాపాగ్రే సంఖ్యాభేదే ప్రకర్షయోః" అని విశ్వము కొమ్మ రదనాళియో=ఆకాంత దంత పంక్తియన్ననో, శతకోటియగును=శతకోటి నాణెములగునని యర్థము, వజ్రాయుధమే యగునని భావము. ని శత కోటిస్స్వరుశ్శంభోయని యమరము. సుదతికటి సీమయందుమా= ఆ నారి యొక్క శ్రోణి ప్రదేశమందామా, క్షోణియగును= క్షోణి సంఖ్య నాణెము లగునని యర్థము, భూమియే యగునని భావము. ఇఁకన్= ఇంకను, పల్కుపల్కినన్= మాట్లాడినటులైన, ఎంత పైకమగునో యని యర్థము ఎంతటి పిక సముదయమగునో యని భావము. అనగా నా కామిని సుగు ణము లతిశయించిన వనియును, పలువరుస నూఅంచుల వాలును పోలు ననియును (వజ్రాయుధమనుట) కటి ప్రదేశము భూమిని పోలుననియును పలుకులు కోకిలలను పోలుననియు ఫలితార్థము.

చ॥ అచలను బోలునట్టి కటినారసి యా లలనా కుచద్వయం
బచల యుగంబు నాయెఁగటియాదటనే యధికమైనఁగాంచి త
త్కుచము లరిద్వయంబయి యెదుర్కొని భంకల దూఱి గూడలం
టుచుఁ జెవులందఁ బైకెగసెడున్నడి మంత్రపుఁ గల్మికిట్లెకా॥

టీ॥ అచలను బోలునట్టికటిన్ = భూమిని బోలునటువంటి పిరుదును. అరసి= చూచి, ఆలలనా= ఆ యెలనాగయొక్క, కుచద్వయంబు= స్తనయుగ్మము అచల యుగంబు నాయెన్= అచల వాచ్యమైన పర్వత యుగళమాయెను, కటి= పిరుదు, అదటనే =వెంటనే, అరియైనన్ =శత్రువుకాగా, కాంచి= చూచి, అనియర్థము రథచక్రము కాగా చూచియని భావము. తత్కుచ ములు= ఆ స్తనములు, అరిద్వయంబయి= శత్రుయుగళమై అని యర్థము అరివాచ్యమయిన చక్రవాక పక్షియుగ్మమైయని భావము, ఎదుర్కొని= ఒండొండభిముఖములై, చంకన్= చంకల యందున, దూఱి =దొబ్చినవి యై, గూడలన్= భుజాగ్రములను. అంటుచున్ = అంటుకొనుచును. చెవులందన్= చెవుల నందుకొనుటకు, పైకెగసెడున్= మీదికెగయును. నడిమంత్రపు గల్మికిట్లెకా = మధ్యకాలమున గల్గిన సంపత్తునకింతయే కదా! అనగా నచలతుల్యమయిన పిరుదులను గాంచి స్తనద్వయము అచల యుగ్మమాయెననియును, అంతట నాగక చంకల క్రింది దనుక పోయి దూఱి గూడలందుకొని చెవులు బట్టుకొన పయికెగురబోవునని యును, స్త్రీ గల్గిన నాడే పిరుదు జనించినదనియును పిరుదుతోడనే చంకలు, గూడలు చెవులు గల్గినవనియును, అందువలన తదవ యవములు పిరుదుకు సంబంధించినవి యనియును, వాటి నాక్రమించి చెవులు బట్టుకొని యాడించుటకు స్తనములు పైకెగయుననియును, నడి మంత్రపు కల్మియనుటచే కుచములు మద్యకాలములో వృద్ధిఁ బొందినవి యనియును ఫలితార్థము. స్త్రీల కుచము లెగు మొనలు గలవిగా వర్ణించు ట కవి సమయ సిద్ధమని గ్రహించునది.

ఆ॥ వె॥ వాలుగన్నులగును వాలుగన్నుల తళ్కు
భ్రమ రకములెయగును భ్రమ రకములు
యుగ్మ లికుచములెక యుగ్మలి కుచములు
మించు మించు దేహ మించు మించు॥

టీ॥ వాలుగన్నుల తళ్కు = వాలైన కన్నులయొక్క కాంతి, వాలుగ + అన్నులు + అగును = ఆడు చేపలేయగును. భ్రమరకములు = కురులు భ్రమరకములేయగును = తుమ్మెదలేయగును, ఉగ్మలి కుచములు = ఆచేడియ స్తనములు, యుగ్మలికుచములెక = రెండు నిమ్మపండ్లేకదా, దేహము = శరీరము, ఇంచుమించు = రమారమి, మించున్ మించున్ = మెరపు తీగె నతిక్రమించును. (తుల్యయోగితాలంకారము)

సీ॥ సరసు తత్పతి నాభి జతగాక నుడుల జో
డొందనెంచియు తలక్రిందులయ్యె
నటుఁగాక వేరర్థమై జడకెనగాఁ బె
నంగి గామికి ముఖ భంగమయ్యె
నటులయ్యు మోవి సామ్యముగాఁ దలఁచి గాక
తిరిగి కేలునకుద్ది దొరయనెంచె
నటులేని గాక దురాశచేమఱలను
తిరిగి శ్రోణికి నీడుదేల నెంచె

గీ॥ నటులఁగాక నొకట రెంట నరయ మూఁట
నాల్గిఁ బైదిట నాఱిట న్నమత గామి
పంకమూనియుఁ బురుగులు వడియు విషముఁ
గనియు నీరయి జాఱియుఁ గలిసేనేల॥

టీ॥ సరసు = కొలను, తత్పతినాభి జతగాక = ఆ చేడియ బొడ్డుకు సమానముగాఁ జాలక, నుడులజోడొందనెంచియున్ = మాటల సమానమును వహింపఁ దలఁచి, తలక్రిందులయ్యేన్ = మీదు క్రిందాయెనని యర్థము. 'సరసు' యను శబ్దము తలక్రిందు కాగా 'సురస' అనియాయెనని భావము. (సురస అనగా శ్రేష్ఠమయిన తేనెయనుట) అటుగాక = తేనెయై మాటలతో సమానము కాఁజాలక, వేరర్థమై = ఇంకొక అర్థమును పొందినదియై (సురస యనగా నాగమాత యనుట), జడకెనగాఁబెనంగి = జడకు సమానమగుటకు బెనగులాడి, కామికి = కానందులకు, ముఖభంగమయ్యేన్ = ముఖ వర్చస్సు తగ్గినదియాయెనని యర్థము, ముఖాక్షరము లేనిది యైనదని

భావము. ముఖాక్షరము పోగా 'రస' యని నిల్చెను. (రసయనగా నమృత రసమనుట) అటులయ్యున్ = అట్లు నమృత రసమయ్యెను. మోవి సామ్యముగా దలచి కాక = పెదవితో సమానముకానెంచి కాకపోవుటవలన, తిరిగి = తలక్రిందై, 'రస' తలక్రిందు కాగా (సర అని యాయెననుట), కేలునన్ = హస్తమునకు, ఉద్ది = సమానము, దొరయనెంచెన్ = వహింపనెంచు కొనియెను. (సర అనగా హారమనుట). అటులేనిగాక = అట్లు హారమై హస్తముతో సమానము రాజాలక, దురాశచే = పెడ్డ ఆసతో, మఱలను = మళ్లి, తిరిగి = తలక్రిందై, (సర తలక్రిందు కాగా రస అని ఆయెననుట) శ్రోణికి నీడు దేలనెంచెన్ = పిరుదునకును సమానముగా తేలుటకు నూహించెను, (రస యనగా భూమియనుట) అటులగాక = అట్లు భూమియై పిరుదునకు సమానము రాజాలక, ఒకట రెంటనరయు మూఁట నాల్గింట నైదింట నాఱిటన్, సమతగామి = ఒక్కంట, రెండింట, విచారింపగా మూఁడింట, నాల్గింట, నైదింట, నాఱింటన్ సమానము కాజాలకపోవుట వలన, పంకమూనియున్ = పాపమును వహించియని యర్థము. బొడ్డుతో సమానము వచ్చుటకు బూనిన కొలను బురదను వహించి యని భావము. పురుగులు వడియున్ = పాపమును వహించిన మీదట పురుగులు పడినవి యనిభావము, విషము గనియున్ = పురుగులు వడిన మీదట విషమును వహించియునని అర్థము. జడుగు సమానము వచ్చుటకు బూనిన నాగమాత విషమును వహించియునని భావము. నీరయి = విషము వహించిన మీదట కుళ్ళినీరై యని అర్థము. పెదవితో సమానము రాబూనిన అమృత రసము పల్చనయైయని భావము. జాఱియున్ = కుళ్ళు పట్టి నీరై దిగజాఱి యని అర్థము. హస్తములతో సమానము రాబూనిన హారము వ్రేలకాడియని భావము. కలిసె నేలన్ = కుళ్ళు పట్టి నీరై జాఱిన మీదట భూమియందు కలిసెనని భావము. అనగా కొలనులో బురద యుండుట, తేనెలో పురుగులు పడుట, సర్పములకు విషముండుట, సుధ నీరుగానుండుట, హారము జాఱి యుండుట, భూమి మన్నై యగుట సహజమని గ్రహింపునది.

చ॥ కు మగువ శ్రోణిఁబోలమికిఁ గుందుచు సున్నకుఁ దెల్ప నేను మ
ధ్యమును జయింతు నంచుఁజని తా జతగాక భ యన్ వయస్యకా
క్రమమును దెల్పెఁదాఁజని నఖంబులఁబోలక మూఁడు నేక శ
బ్దముగను పోయి చన్గవకు తగ్గెను కల్గవె నెత్తి పోట్లికన్॥

టీ॥ కు=భూమి, మగువ శ్రోణికిన్=ఆ చేడియ పిరుదును, పోలమికిన్= సమానము రానందుకు, కుందుచున్=చింతింపుచు, సున్నకుఁదెల్పన్= సున్నతో దెల్పుకొనగా, నేను మధ్యమును జయింతునంచు జని=ఏను నడుమును గెల్తునని పోయి, తాన్=తాను, జతగాక=సమానము కాఁజాలక, భ యన్ వయస్యకు=భ యనే చెలికత్తియకు (భ యనగా నక్షత్రమనుట). ఆ క్రమమును దెల్పెన్ = ఆ విధమును తెలియపరిచెను, తాఁ జని =ఆ నక్షత్రము పోయి (అనగా భయనుట), నఖంబులన్ పోలక = గోళ్ళతో సమానము రాజాలక, (గోటి మాత్రము చేయకననుట) మూఁడున్ =ఆ మూడును (అనగా 'కు'యును, 'ం'యును, 'భ'యును అనుట) ఏక శబ్దముగ పోయి = ఒక్క మాట మీద పోయినవియై, చన్గవకుఁ దగ్గెను= స్తనద్వయమునకు తగ్గిన వాయెను, అనగా నామూఁడక్షరములునేక శబ్దముకాగా కుంభ అని యాయెనని గ్రహించునది. కల్గవె నెత్తి పోట్లికన్= ఇంక నెత్తిపోట్లు కలుగకుండునా (కల్గునని యనుట). కుంభ శబ్దము కడవల యందును గజకుంభముల యందును ప్రవర్తించుట వలన, కడువలకు గట్టియు నోడును జూచుకొనుటకు నెత్తిపోట్లుండుటయు గజకుంభములకు మావటివాని యంకుశ సంబంధమైన నెత్తిపోట్లుండుటయు, సహజమని ఫలితార్థము. ఇందు రెండవ పాదము యతి దగ్గర నుండి "యాగక భమ్మను నేస్తురాలికా" అని పాఠాంతరమును రచింపబడినది.

కం॥ కుదర సమాకృతి లాభ
మ్మధికముగాఁ గొనెఁ గుచద్వయంబొండొండా
కుథముఖ లిపులు ననినఁ గ
ట్యధర దృగంగోక్తి నాసి కాస్య నఖములొ॥

టీ॥ కుచద్వయంబు = ఆ చేడియ స్తనద్వంద్వము, కుధర = పర్వతములకు, సమ = సమానమైన, ఆకృతి లాభమ్మున్ = రూపప్రాప్తిని = అధికముగాఁ గొనెన్ = అతిశయముగా వహించెను. ఆ కుధము ఖలిపులు = అ యొక్క కుధ మొదలైన యక్షరములు, ఒండొండు = ఒకటొకటి, చనినన్ = నశించినను, కటి = పిరుదును, అధర = పెదవియును, దృక్ = కనులును, అంగ = శరీరమును, ఉక్తి = పలుకులును, నాసిక = ముక్కును, ఆస్య = మోమును, నఖములు = గోళ్ళును, ఔన్ = అగును. అదెట్లనగా కుచద్వయము కుధర సమాకృతి లాభమ్మధికముగాఁ గొనెన్‌గదా, అందులో, ఒండొండా కుధ ముఖలిపులు సనినన్ = ఒక్కొక్కటియు నా కు-ధ మొదలైన యక్షరములు నశించినను, అనుటచే మొదటి యక్షరము పోఁగా, ధర సమాకృతి లాభమ్మని నిల్చెను, కటి = పిరుదు. ధర = భూమియొక్క సమ = మిట్టపల్లములేని. ఆకృతి లాభమ్మున్ = రూపప్రాప్తిని, అధికముగాఁగొనెన్ = అతిశయించునట్లుగా వహించెను అంతటనిట్లే గ్రహించునది ఆధర = పెదవి, ధ యను నక్షరము పోఁగా మిగిలిన రసమాకృతి లాభమ్మున్ = రస = అమృతము యొక్క, మా = సంపద వంటి (అనగా తీయఁదనము ననుట), ఆకృతి లాభమ్మున్ = రూపప్రాప్తిని, కొనెన్ = వహించెను, దృక్ = కన్నులు, ర యను నక్షరము పోగా మిగిలిన, సమాకృతి లాభమ్మున్, సమ = ఎగుడు దిగుడుగాని, ఆకృతి లాభమ్మున్ = రూపప్రాప్తిని, కొనెన్ = వహించెను, అంగ = శరీరము, స యను నక్షరము పోగా మిగిలిన మాకృతి లాభమ్మున్, మా = లక్ష్మీదేవి వంటి, ఆకృతి లాభమ్మున్ = రూపప్రాప్తిని, కొనెన్ = వహించెను, ఉక్తి = పలుకులు, మా అను నక్షరము పోఁగా మిగిలిన, కృతి లాభమ్మున్, కృతి = ప్రబంధరచన యొక్క, లాభమ్మున్ = ప్రాప్తిని (అనగా చమత్కారమనుట) కొనెన్ = వహించెను, నాసిక = ముక్కు, కృ అను నక్షరముపోగా మిగిలిన లాభమ్మున్, ల = చంద్రుని వంటి, ఆభమ్మున్ = మిక్కిలి దీప్తిని, కొనెన్ = వహించెను. ని : లఃఖణ్డితే త్రిషాద్వానే స్త్రీ నేందౌ లవణే తులమ్, అని నానార్థ రత్నమాల, నఖ = గోళ్ళు, ల యను నక్షరము

పోఁగా మిగిలిన; భమ్ము=నక్షత్రము యొక్క, అధికమున్=అతిశయమును, కాన్=అగుటకు, కొనెన్=వహించెను, ఔ=ప్రశంసనీయము. అట్లుకాదేని ప్రథమ పాదమునకును చతర్థ పాదమునకును ఔన్ అను క్రియతో పైవిధముగా నొక్కొక్క యక్షరము పోఁజేసి క్రమముగా జూచుకొనవలయును.

కుధర సమాకృతి లాభము=పర్వతమునకు సమానమైన ఆకృతిని (కుచములు)
ధర సమాకృతి లాభము=భూమికి సమానమైన ఆకృతిని (పిరుదులు)
రసమాకృతి లాభము=అమృత సంపదవంటి రూపప్రాప్తిని (అధరము)
సమాకృతి లాభము=ఎగుడు దిగుడు గాని రూపప్రాప్తిని (దృక్కులు)
మాకృతి లాభము=లక్ష్మీదేవి (మా) వంటి ఆకారప్రాప్తిని (అంగము)
కృతి లాభము=కావ్యరచనా రూపాన్ని అంటే చమత్కారాన్ని (ఉక్తులు)
తిలాభము=నువ్వుపువ్వువంటి దీప్తిని (నాసిక)
లాభము=చంద్రుని (లః) వంటి కాంతిని (ఆస్యము)
భము=నక్షత్రాతిశయమును (నఖములు)

అనగా మొదటి పాదమైన "కుధర సమాకృతి లాభము" అనుదానిలో నొక్కొక్క అక్షరము తీసివేయుచు పోతే అవి వరుసగా—కటి, అధరము, దృక్కులు, అంగము, ఉక్తి, నాసిక, ఆస్యము, నఖములు అనే వానితో సరిపోతాయి

కేశవాచారి : మహాకవి శేఖరా! మీరు సహజంగా శ్రీనాథుని వలె శృంగార ప్రీతి కలవారు. మీ సిద్ధయోగి చరిత్ర వేదాంత గ్రంథము కదా! అందు శృంగారానికి చోటు కల్పించారా?

కాశీపత్యవధాని : రసప్రియా! మీరన్నట్లు వేదాంత గ్రంథమైన నా సిద్ధయోగి చరిత్రలో శృంగారానికి చోటు లేదు అయినను సిద్ధయ్య వివాహ ఘట్టములో అచ్చాంబి తనను పెళ్ళి చేసుకొనుమని సిద్ధని యొద్దకు చేటికను పంపినట్లు కథ కల్పించి అందులో శృంగార రసాన్ని పోషించాను. ఆ చేటిక సిద్ధనికి అచ్చాంబి అందాన్ని ఇలా వర్ణించింది.

కం॥ అబ్బాంబీ పిరుదులకెన
అబ్బాంబీ పిరుదులె యనవొ నయ్యారే!
అబ్బాంబీ మధ్యమునకు
నబ్బాంబీ మధ్యమె సమమనవొ నారే॥
(ఐదవాశ్వాసము - 60వ పద్యం)

కేశవాచారి : ఇందులో నేముంది? అబ్బాంబీ పిరుదులు అబ్బాంబీ పిరుదులవలె అబ్బాంబీ నడుము అబ్బాంబీ నడుము వలె ఉంది, అని ఆమె పిరుదులు, నడుము సాటిలేని సౌందర్యం కలవని చెప్పటమేకా దీని భావం, ఇందులో చమత్కార మేముంది గురువర్యా!

కాశీపత్యవధాని: లేకేమి! మీరనుకున్నది సాధారణభావం అబ్బాంబీ అనేపదంలో అక్షరాలమీద చక్కని చమత్కారం చేశాను. అవధరించండి. ఇక్కడ అ+బాం+బి అనే అక్షరాలు గ్రహించి అ, బా, బి, అనే అక్షరాల అడుగ భాగాలు ఎలాగున్నాయో, అబ్బాంబీ పిరుదులు అలా వున్నాయని అర్థం, అలాగే ఆమె నడుము బా, బీ లనే అక్షరాల నడుమనున్న సున్న వలె వుందని అంటె ఆమెకు నడుము సున్న అని అర్థం వస్తుంది.

ఇది అక్షరాలతో ఆడుకుంటు చేసిన కవి చమత్కారము. వృత్తి రీత్యా మీరు అంకెలతో ఆడుకుంటూ చేసే చమత్కారంలా-

ఇదే విధంగా అబ్బాంబీ ముఖ సౌందర్యాన్ని ఊహించి చేసిన కల్పన కూడ వినండి.

చ॥ కుదురుగ లేమ ఫాలమునకున్ సరిగావలెనంచుఁ గ్రొన్నెలన్
మొదట సృజించి పోలమికి మోమునకున్ సరిజేతునంచు పెం
పొదవగఁ బెన్నెలన్ సలిపియున్ సరిగామిఁ గృశింప జేసియున్
గుదురక సృష్టికర్త చెడగొట్టుచుఁ జేయుచునుండె నేటికిన్॥

అచ్చాంబీ నుదుటితో సమానంగా చేద్దామని మొదట చంద్రుణ్ని చేశాడు, అది ఆమె నుదుటితో సరిరాక పోయేసరికి ఆమె ముఖంతోనైన సమానం చేద్దామని నిండు చంద్రునిగా మార్చాడట, అప్పటికి సమానం కాకపోయేసరికి మళ్లీ దాన్ని కృశింపజేసి సరిచేద్దామనుకొన్నాడట. కాని వృద్ధి పొందించినా కృశింప చేసినా ఆమె ముఖంతో పోలక పోవడం వల్ల సృష్టికర్త ఎప్పటికైన ఆమె ముఖంతో చంద్రుణ్ని సరిచేయాలనే సంకల్పంతో దానిని చేయడం చెడగొట్టడం, మళ్లీ చేయడం అనే తన పనిని ఇప్పటికీ చేస్తూనే ఉన్నాడట. చంద్రుడు శుక్ల పక్షంలో వృద్ధిపొందడం కృష్ణ పక్షంలో క్షీణించడం అనేది లోకసహజం. దీనిని చెప్పిన తీరులోనే ఉంది చమత్కారం.

ఈ సిద్ధయోగి చరిత్రలో పంచమాశ్వాసంలో స్త్రీవర్ణన పద్యం అలకించండి. దీనిని నా సారంగధరీయంలో వేయవలసి యుండెడిది. అది వ్రాయునప్పుడీ పద్యం తట్టలేదు.

గీ॥ కౌను మా దృష్టి దోషంబు కతన సన్న
గిల్లె నంట కుచాద్రుల క్రింద దృష్టి
సోకునే యని సడిఁదెల్ప శ్రుతుల కడకు
నేగెనన నొప్పె నింతికి సోగకనులు॥

కేశవా : ఓహో! ఒక చిన్న పద్యంలో చిక్కిన నడుము, ఉన్నత కుచములు శ్రుతులదాకా ప్రాకిన సోగకనులు వర్ణింపబడినవి ఈ వర్ణనమపూర్వం - అద్భుతం, అయితే కవి శిరోమణీ! అంగాంగ వర్ణన గాక మీ సిద్ధయోగి చరిత్రలో అచ్చాంబి సిద్ధని పెళ్లిచేసుకోవాలని నిశ్చయించుకొన్న సన్నివేశాన్ని రాశులతో పోలుస్తూ రమణీయంగా చెప్పినారు కదా. ఆ పద్యం మీముఖత వినాలని కుతూహలంగా ఉంది. దయచేసి వివరించెదరా?

కాశీపతి : అలాగే! అది నా సిద్ధయోగి చరిత్రలో నైదవ అశ్వాసములో 62వ పద్యం. చెపుతాను వినండి,

సీ॥ పైఁగేరి నొక యింటి పడుచు నీ యెలనాగ
యందంబుచే సిగ్గునొందఁజేసె
దాని మూడవ యింటి దానిని బొమలచే
వంచె నాల్గవ యింటి మించు దాని
జంఘలచే గుల్ల సలిపె నైదవ యింటఁ
గలదానిఁ జనులచే వెలితిఁజేసె
నాఱవ యింటఁ జెన్నారు దానిని కను
గవ చేత వారిలోఁ గలియఁజేసె

గీ॥ పదునొకండవ యింటను బరగుదానిఁ
గౌనుచే నోరుఁ దెరిపించెఁ గడమ వాటి
నెదురఁ బనిలేదు గాని తొమ్మిదవయింటి
దాని కెనగాక నీకేలు బూనఁదలచె॥

అచ్చాంబీ నివసిస్తున్న వీధికి పైవీధిలోని మొదటి యింట్లోని అందఁగత్తెను అందముచే సిగ్గుపడేటట్లు చేసిందని, దాని మూడవ యింటి దానిని కనుబొమలచే ఓడించిందని, నాల్గవ యింటి దానిని జంఘలచే జయించిందని, అయిదవ యింటి దానిని స్తనములచే నధిగమించిందని, ఆఱవ యింటి దానిని కనుగవచే పైవారిలో కలిసేటట్లు చేసినదని, పదకొండవ యింటి దానిని కౌనుచే ఓడించెనని, మిగిలిన యిండ్లలోనివారు ఎదుర్కోవలసినంత అందగత్తెలు కారని, కాని ఒక్క తొమ్మిదవ యింటిలోని ఆమెను మాత్రం జయించలేక సిద్ధని వివాహమాడటానికి నిశ్చయించుకొన్నదని భావం. అచ్చాంబీ కన్య కాబట్టి యీ పద్యానికి అన్వయం కన్యరాశి నుండే ప్రారంభం. (ఆయా రాశులను జయించిన విధానానికి వాడిన క్రియాపదాలుకూడ ఆయా రాశులకు తగినట్లుగానే ఉన్నవి).

కన్యను తన అందంచేత సిగ్గు పడేటట్లు చేసినదనడం, ధనుస్సును తన కనుబొమలతో పోలలేక వంగిపోయేలా చేసిందనడం మకరాన్ని తన జంఘలచే

గుల్ల చేసిందనడం (పైభాగం), కుంభాన్ని తన కుచాలతో పోలలేక వెలితి పడే టట్లు చేసిందనడం, మీనమును తన కన్నులచే నీటిలో కలిసి పోయేటట్లుచేసిన దనడం, సింహాన్ని తన నడుముజేత నోరు తెరిపించినదనడం, మిగిలిన రాశుల గురించి చెప్పనక్కరయే లేదనడం. కాని మిథునాన్ని జయించలేక ఆ రాశిని గూడ జయించాలని సిద్ధని వివాహం చేసికొన నిశ్చయించుకొన్నది.

కేశవాచారి : కమనీయ కవితామూర్తీ! సిద్ధయోగి చరిత్రలో జ్ఞానమూర్తిగా పుట్టబోవు సిద్ధడు తల్లి కడుపులో పిండరూపముగా పెరుగు విధము - గర్భిణీ చిహ్నములను వేదాంత గర్భితంగా మీరు ఎట్లు చమత్కరించినారో ఆ (జనన) సన్నివేశములో ఒకటి రెండు పద్యములు వినిపిస్తారా?

కాశీపత్యావధాని : అలాగే - ఆ ఘట్టములో వ్రాసిన ఈ పద్యములు వినుడు.

సీ॥ తెలుపెక్కె సతికి ముద్దుల కపోలములు నా
స్తి కులనెమ్మొగములు దెలుపుఁబార
నలుపెక్కె సతికి నిర్మల చూచుకములు దూ
ర్తుల వదనంబులు నలుపు బార
బలుపెక్కె సతికి దుర్బల వలగ్నము మహా
త్ముల తపోనిష్ఠలు బలుపు మీఱ
పొలుపెక్కె సతికి సొంపుగ దేహమెల్ల సా
ధుల హృదంభోజముల్ పొలుపు మీఱ

గీ॥ నలసత ఘటిల్లె సతికి భూస్థలిని గల్గు
కుటిల మతులెల్లరకు నలసట ఘటిల్లఁ
బావన జ్ఞానమూర్తి గాఁబోవునట్టి
పిండ మా సతి కడుపులో బెలుగు కతన॥

సీ॥ క్షోణి యా గర్భస్థు జూడనేగు ననంగ
వనిత రేవడి మన్నుఁ దినఁగఁ బూనె
జల మా చిఱుతఁగాంచి వెలికి వచ్చె ననంగ
నువిద మై ఘర్మ బిందువులు వెడలెఁ
దేజ మా బాలకుఁ దిలకింప డాసెనాన్
రాజీవ ముఖ మేను తేజరిల్లె
ననిలమా శిశుమాటి కరసి వచ్చుననంగ
నతివ యూర్పుల వేగమతిశయిల్లె
గీ॥ గగనమాపాప సరస కరిగె ననంగఁ
గలికి జఠరంబుఁ బెంపొంది గగనమయ్యెఁ
బంచభూత ప్రియుండయి పరుగునట్టి
బాలుఁడాయమ కడుపులోఁ బ్రబలు కతన॥

వ॥ అర్థము సుగమము.

కేశవా : గురువర్యా ! మీరనేక ప్రబంధాలను క్షుణ్ణంగా పఠించినవారు. ప్రబంధ కవుల పోకడలలో అంత్యచ్ఛేక శబ్దాలంకార విలసితమైన పద్యాలు మీరెన్నియో రచించారు. ఒకటి రెండు వినిపించి నన్నాం దింపఁజేయ ప్రార్ధన.

కాశీపతి : అవధరింపుము రసప్రియా !

నా సారంగధరీయము నుండి -

సీ॥ ఒక చాయ మృదుగేయ మొగిసేయఁగ నమేయ
కమనీయ తర గాయక సముదాయ
మొక చాయ నిది తాయమొకదా యనగ తీయ
నవుచాయ కృతిజేయ కవి నికాయ
మొక చాయ పెఱ రాయల కజేయ మహనీయ
సదుపాయములు సేయ సఖులతోయ
మొక చాయ ననపాయతకు నాయములు సాయ
ములు సేయ గణనీయ బుధ వినాయ

గీ॥ కు లోక చాయన తపనీయ లలితకాయ
గణిక లెసలారఁ బేరోలగమున నుండి
స్వర్నగరమును బోలు గద్వాల నేలు
నాదిలక్ష్మి మహారాజ్ఞి యతుల పాజ్ఞి॥

ఇది అంత్యచ్ఛేక శబ్దాలంకారముతో రచించిన పద్యం. భట్టుమూర్తి "వసు చరిత్ర" లోని "ఒక చాయ ననపాయ పిక గేయ సముదాయ" మను పద్యాన్ని స్మరింపజేస్తుంది.

మరొకపద్యం - సర్వతః ప్రాస ఛేకాలంకారముగా రచించినది. ఇదియు సారంగధరీయములోనిది.

సీ॥ మిగులఁ దెల్లని డాలు నెగడు మేననఁ బాలు
సగము నొందిన యాలు సిగనజాలు
పగతుర నిల గూలు పగల ముమ్మొనవాలు
మృగమెసంగిన కేలు నగము ప్రోలు
మొగము నేనుగు బోలు నగలు గుల్కెడు చాలు
సొగసు పాప సరాలు తెగని శ్రీలు
పొగడు జోగుల చాలు నొగులు బాపెడు వీలు
జిగి గల పులి తోలు దగిన సేలు

గీ॥ నొగి గలుగు సత్కృపావాలు నిగమమూలు
విగత కిల్బిష జాలు దివ్యగణలోలు
నగణిత యశో విశాలు భవ్యగుణశీలు
బొగడి కృతిజేయనేలు నట్లగుట మేలు॥

ఇది ముక్కు తిమ్మన రచించిన "పారిజాతాపహరణము" లోని "మగ మీల నఁగజాలు తెగగీలు కొనువాలుఁ, గనుగవ నొకవింత కాంతి యొదవె" యను పద్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

కేశవా : గురుదేవా! మీ నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానము నుండి మరియు మీ శ్రద్ధికావ్యము 'సారంగధరీయము' నుండి చిత్ర కవితా వైదుష్యాన్ని చాటే పద్యాలు మచ్చునకు కొన్నిటిని చవి చూపిస్తారా?

కాశీపతి : మీ కోరిక కాదందునా! వినండి.

ఏకాక్షరి :

కం॥ నే నెన్నైన్న నను నీ న
న్నానా నే నాన నూననా నన్ననసౌ
నా నిన్ను నెన్న నన్నా
నా నేనున్నాన నానినా నన్ననా॥

(నిరోష్ఠ్య శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానము. అశ్వా : 2, పద్య 76).

ఈ పద్యము ఒకే యక్షరము "న" దానికి సంబంధించిన గుణింతం తో నడిచింది. పూర్వకవులలో ఏకాక్షరులు వ్రాసిన వారున్నారు కాని, అవి అంత సులభ గ్రాహ్యములు కావు. నేను వ్రాసిన యీ ఏకాక్షరి జాగ్రత్తగా యిలా విడదీసి చదువు కొంటే సులభంగా అర్థమవుతుంది నేను ఎన్నైనను ఈ నన్నానా? నేను అనను (అజ్ఞను) ఊననా? నన్ను అననౌనా? నిన్ను ఎన్నననా నా? నేనున్ నానన్ (సిగ్గును) అని నాను. (నేను లజ్జను పొందినాను) అన్ననా = ఆశ్చర్యము

ఇక అందులోనిదే "ఏక పాది" వినండి.

ఉత్సాహము॥ నాడు దాని గాన నేర నా తుటారి జోడుగా
నాడు దాని గాన నేర నా తుటారి జోడుగా
నాడు దాని గాన నేఱ నా తుటారి జోడుగా
నాడు దాని గాన నేర నా తుటారి జోడుగా॥

(హరి : అశ్వా : 2, పద్యము 59).

తా॥ నాడు దాని గాన నేర నా=పూర్వం దీనిని యెప్పుడు చూడలేక పోయా నా! అని ఆశ్చర్యం వెల్లడించడం ఒక అర్థము. ఈ ప్రదేశములో ఉంటు న్నప్పటికీ తెలిసికొనలేక పోయితినే అని తెలివి తక్కువ తనమును వెల్ల డించు కొనడం రెండవ అర్థము. కాన నేరన్ + ఆ + తుటారి జోడుగా, నాడు దాని అని విడదీస్తె కాన నేరను అని మొదటి అర్థానికి చెల్లగా ఆ తుటారి అని ముందు పదమునకు అన్వయించడానికి వీలున్నది. అప్పుడు ఆ గడుసుదానితో సమానముగా ఆడేదానిని కాననేరను అని అన్వయం కుదురుతుంది.

ద్విపాది॥

గీ॥ రాజిత నగాగ్రమున విహారంబు సల్పు
నీల కంఠాతిశయము రాణిలుట కంటె
రాజిత నగాగ్రమున విహారంబు సల్పు
నీల కంఠాతిశయము రాణిలుట కంటె॥
(సారంగధరీయము అశ్వా : 2, ప : 138).

ఇందులో ఒకటి–రెండు పాదాలు ఏయక్షరాలతో నున్నాయో, మూడు – నాల్గు పాదాలు కూడ ఆ అక్షరాలతోనే ఉన్నాయి. కాని అర్థం మాత్రం వేరు. "ప్రకాశించే పర్వత శిఖరాగ్రమున వేడుకగా తిరిగే నీలకంఠుడైన ఈశ్వరుని గొప్పతనము కంటె" - అని ఒకటి-రెండు పాదాల అర్థం. "విరాజిల్లు చెట్ల చివర సంచరించే నెమళ్ళ అతిశయము" అని మూడు–నాల్గు పాదాల భావం. అనగా ఈశ్వరని కంటె కూడ నెమళ్ళ అతిశయము ఒప్పారు చున్నదని వర్ణింపబడినది.

కేశవా : కవి శిఖాణీ! మీ రచనా చమత్కృతిని వర్ణింప నా వంటి వానికి అశక్యము మీ చమత్కృతిని వినిన కొలది ఇంకా వినవలెనని కూతూహలము ఉవ్విళూరుచున్నది. వర్గపంచ కాక్షరములను విడనాడి కేవలము య ర, ల, వ, శ, ష, స, హ, ళ, అ తో గ్రంధమురచించిన కవులు కదా! అట్టి అపంచ వర్గీయమైన నేదేని యొక పద్యము విని పించి ఆనందపరచుడు గురుదేవా!

కాశీపతి : అలాగే నాయనా! రసప్రియా! సారంగధరీయములో కూడ రచిం చిన ఒక అపంచవర్గీయ పద్యమును వినుము.

## -: అ పంచ వర్గీయము :-

(నిర్నాసిక)

ఆ॥వె॥ శర్వ శైలవాస సారసారి విలాస
హార యశో విశాల సరస శీల
సార శేషహార సర్వేశ సురవీర
వృషవరాశ్వ యేల వేల లీల॥

(సారంగధరీయము అశ్వా : 2, పద్యము : 126)

ఈ పద్యము ముక్కులు మూసికొని చదివినను నంగి లేకుండునట్లుండును. కావున దీనిని నిర్నాసిక యనదగును.

టీ॥ శర్వ=శర్వనామము గల వాడా! శైలవాస=పర్వతము నివాసముగా గల వాడా! సారసారి=చంద్రుని వంటి, విలాస=చక్కదనము గల వాడా! హర = హరనామము గల వాడా! యశో విశాల = కీర్తి చేత విస్తృతమైన వాడా! సరసశీల=రసయుక్తమైన ఆచారము గల వాడా! సార = శ్రేష్ఠమైన, శేషహార = ఆది శేషుని హారముగా గల వాడా! సర్వేశ=సమస్తమునకు ప్రభువైన వాడా! సురవీర=దేవతల యందున పరాక్రమ వంతుడ వైనవాడా! వృషవర=బసవేశ్వరుని, అశ్వ=వాహనముగా గల వాడా! లీలన్=విలాసముగా, ఏల వేల = రక్షింపవేటికి? ఇది శివస్తోత్రపరముగా రచించిన అపంచవర్గ పద్యము. శివపరముగా నందలిచే మరొక పద్యము వినండి.

## నిరోష్ఠ్యములు (అచలజిహ్వక)

ఆ॥వె॥ మామ మామ పాప భీమ మౌ ముప్పాపి
పాప మేపు మాపి బాముఁబాపి
భూమిఁ బబ్బ మబ్బఁ బేము మమ్మోమమి
మేము బోము భామ మేమి భీమ॥

(సారంగధరీయము. అశ్వా : 2, పద్యము : 127)

టీ॥ మామ మామ పాప=మన్మథుని యొక్క, భీమమౌ = భయంకరమైనట్టి, ముప్ప + అపి = బాధను ఆపి, పాపము = దుష్కృతము యొక్క, ఏపున్ = ఔద్ధత్యమును, మాపి = మాయఁజేసి, బామున్ = దుఃఖమును, పాపి = విడఁజేసి, భూమిన్ = పుడమియందున, పబ్బము + అబ్బన్ = ఉత్సవము లభించునట్లుగా, పేమున్ = ప్రేమతోడ, మమ్ము + ఓమమి = మమ్ములను రక్షించకుంటచే, మేము బోము = మే మేగెడి వారము కాము, భీమ = ఓ శంకరా! భామమేమి = తమకు కోపమేటికి. భామ శబ్దము కోపమన్నందుకు శబ్దార్థ చంద్రికఁ జూడుడు.

ఈ పద్యము పెదవులు తగులునట్టి "ప, బ, భ, మ" యను నాల్గక్షరములతోనే రచింపబడినది, ఇది నాలుక కదలకుండునట్లు చదువ వీలగును గావున దీనిని "అచల జిహ్వక" యనవగును.

శివస్తుతి పరముగా మరొక "అచ్చ తలకట్ల సర్వలఘు గీతము నాలకింపుము.

## -: అచ్చు తలకట్ల సర్వలఘు గీతము :-

గీ॥ నగ సదన ఘనతగ యశ నగరదమన
నవ ధవళకర ధర తత భవభయహర
ప్రమథవర యనవరత సదమర వరద
హర గరళగళ భవ కనదసమ నయన॥

(సారంగధరీయము. ఆశ్వా : 4, పద్యము : 30)

ఈ పద్యము కుఱుచ యక్షరములతో శివస్తోత్రముగా రచియింపబడి నట్లు గ్రహించునది.

టీ॥ నగ సదన = పర్వతమే గృహముగా గల వాడా! ఘనతర యశ = అధిక తరమైన కీర్తి గల వాడా! నగర దమన = త్రిపురముల నడంచిన వాడా! నవ = నూతనమైన, ధవళకర = చందమామను, ధర = తాల్చిన వాడా! తత = విస్తృతమైన, భవ భయ హర = సంసార భీతి నడగించు వాడా! ప్రమథ వర = ప్రమథుల కధీశుడవైనవాడా! అనవరత = నిరంతరము, సత్ = శ్రేష్ఠమైన, అమర వరద = దేవతలకు కోర్కెల నిచ్చు వాడా! హర = హర నామము గల వాడా! గరళగళ = విషమును కంఠమందు గల వాడా! భవ = భవ నామము గల వాడా! కనత్ = ప్రకాశ మానమైన, అసమ = బేసి సంఖ్యయగు, నయన = నేత్రములు గల వాడా! యని శివస్తుతి చేయనైనది.

## పాద భ్రమకము

కం॥ సార సురధీర సురసా
తార నగా తత సభాస తత గానరతా
వీర సభా బాస రవీ
మారపరా యమరవార మయురా పరమా॥

(సారంగధరీయము ఆశ్వా : 2, పద్యము : 128)

ఈ పద్యము నందేపాదమున కాపాదము క్రింద మీదుగా చదివిన నొకే విధముగా నుండును.

టీ॥ సార=చేవఁ గల సుర=దేవతల యందున, ధీర = విద్వాంసుడవైన వాడా లేక ధైర్యము గల వాడా లేక స్వాతంత్ర్యము గల వాడా! సురసా=మంచి యనురాగము గల వాడా లేక మంచి యందము గల వాడా లేక మంచి సంతోషము గల వాడా: తారనగ=వెండికొండ యే, ఆతత = విశాలమైన, సభా = కొలువు కూటము గల వాడా! సతత = నిరంతరము. గాన=సంగీతము నందున, రతా = ఆసక్తి గల వాడా! వీర=శూరుడా! సభా=ప్రభావ యుక్తమైన వాడా! భాస=కాంతి యందున, రవీ=సూర్యుడవైన వాడా! మార=మన్మథునకు, పరా=శత్రుడవైన వాడా! అమర=దేవతల యొక్క, వార=సముదయముతో, మయ=నిండిన వాడా! పరమా=ఉత్కృష్టుడవైన వాడా రా=రమ్ము.

(ని : "భా ః ప్రభావే మయూఖే ఽ పి" అ ని విశ్వము)

## పద్య భ్రమకము

కం॥ సారసజ నుత జయ తరల
శూరహరా సాదర వర సుసురా పరమా
మారపరా సుసుర వరద
సారాహర శూలరత యజతనుజ సరసా॥

(సారంగధరీయము ఆశ్వా : 2, పద్యము : 129)

టీ॥ సారసజ=పద్మ సంభవుడైన బ్రహ్మ దేవుని చేత, నుత=కొని యాడ బడు, జయ=జయము గల వాడా! తరల=చలించునట్టి, శూరహరా = రణ సాహసులను హరించిన వాడా! సాదర=ఆదరముతో గూడిన, వర=ప్రభువా! సు=శ్రేష్టుడవైన, సుర=వేల్పు, పరమా=పరమాత్ముడా మార=మన్మథునకు, పరా=శత్రువైన వాడా! సుసుర=మంచివేల్పుల యొక్క, వర=కోరికలను, ద=ఇచ్చు వాడా! స+అరా=వేగయుక్తమైన వాడా! హర=హర నామము గల వాడా! శూలరత=త్రిశూలాయుధము నందాసక్తి కల వాడా! అజ తనుజ=బ్రహ్మ పుత్రుడవైన వాడా! (పురాణ భేదముల వలన శివుడు బ్రహ్మపుత్రుడనుట ప్రసిద్ధమని గ్రహించునది).

ఈ పద్యము చివర నుండి వెనుకకు చదివినను, మొదటి నుండి చివరకు జదివినను అట్లేయుండు విధముగా రచియింపబడినది.

వ॥ రసప్రియా! నా నిరోష్ఠ్య హరిశ్చంద్రోపాఖ్యానములోని ఇంకొక చిత్ర కవితా చమత్కృతి గనుడు. హరిశ్చంద్రుని చేత అబద్ధమాడించాలని తాను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడు విశ్వామిత్రుడు తనలోతా విచారిస్తు ఇట్లా అనుకొంటాడు.

## అన్నీ గుడులు

కం॥ కినిసి సిరిఁ దీసి నీలిగి
తిని సిగ్గిడి కింకిరి కిని దిగి తీరితిఁ గి
త్తిని జీరి నించి చిక్కిడి
తిని జియ్యా యింతి కీర్తిని నిల్చిరి సీ॥

(ని ని. హ. హరి. ఆశ్వా : 2. పద్యము : 135)

తా॥ హరిశ్చంద్రునిపై కోపముతో నతని యైశ్వర్యమంత పోవునట్లు చేసినాను. సిగ్గులేక నీచకార్యానికి (కింకిరి కిని) దిగినాను. నిప్పు (కిత్తి) వంటి హరిశ్చంద్రుని పిలిచి నిందించి ఎన్నియో కష్టాల పాలు చేసినాను. అయినను ఈ రాజు, రాణి (జియ్యా ఇంతి) తమ కీర్తిని నిలుపుకొన్నారు. అని ఈ పద్య భావం, విశ్వామిత్రుడు తనను తాను నిందించుకొను సందర్భమును పురస్కరించి అన్నీ గుడులతో నీ పద్యం వ్రాయబడినది. ఇక శుద్ధ నిరోష్ఠ్యం కనండి.

## శుద్ధ నిరోష్ఠ్యం

కం॥ అలి కాంచి తాశ్రయా శా
ఖల దైత్యానీక నాశ కలితాంత్యాశా
లలితాంతరిక్ష కేశా
సలిలజ నయ నేశ యీశ శశి నీకాశా॥

(సారంగధరీయము. అశ్వా : 2. పద్యము : 136)

టీ॥ అలిక = నొసటి యందున, అంచిత = ఒప్పుచుండిన, ఆశ్రయాశా = అగ్ని హోత్రుడు గల వాడా! ఖల = దుష్టులగు, దైత్యానీక = రాక్షస సైన్యముల. నాశ = హతము చేసిన వాడా! కలిత = ఒప్పుచున్న, అంత్య = చివరదగు, ఆశా = దిక్కు గల వాడా! (ఈశాన్య మనుట), లలిత = మనోజ్ఞమైన, అంతరిక్ష = ఆకాశమునే, కేశా = వెంట్రుకలు గల వాడా! సలిలజనయన = కమలాక్షుడగు విష్ణువునకు, ఈశ = ఈశుడవైన వాడా! శశి = చంద్రుని వంటి, నికాశా = కాంతి గల వాడా!

ఈ పద్యము పెదవులు తగులకుండ చదువటానికి వీలుగా రచింపబడినది "ప" వర్గంతో పాటు "ఉ" కారాన్ని "వ" కారాన్ని గూడ విడిచిపెట్టబడినది. కాన దీనిని శుద్ధ నిరోష్ఠ్యం అంటారు.

## అన్నియు నేత్వాలు

కం॥ కేలేదే తే తేవే
వే లేవే మెట్లె దేబెవే యేల్చెడె
న్నే లేనే వేరే యె
గ్గే లేనే లేదె యేడ్చెదేలే మేలే॥

(సారంగధరీయము. ఆశ్వా : 3, పద్యము : 43)

టీ॥ కేలు = హస్తం, ఏదే = ఎచ్చటనె, తే తేవే = తెమ్ము తెమ్ము, వే = శీఘ్రముగా లేవే మెట్లే = లేవవేమి యెట్లనే, దేబెవే = దీనురాలవా! ఏల్చెడెన్ = రక్షించు వనితను. నేలేనే = నేనుండ లేదా! వేరే = వేరుగా, ఎగ్గే లేనే లేదే = కీడు లేదా దోషము లేనేలేదే, ఏడ్చె దే లే = ఏడ్చెదవెందుకే, మేలే = శుభమేనా! ఇది ఏత్వాలతో రచింపబడిన పద్యము

కేశవా : గురుదేవా! మీరు గుళ్ళు ఏత్వాలతోనే గాక కొమ్ములతో (ఉత్వాలతో) కూడ ఏగ్రంథముననైన మీ చమత్కృతి ప్రదర్శించినారా?

కాశీపతి : లేకేమి? రసప్రియా! అస్మన్నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానమున, హరిశ్చంద్రుడు విశ్వామిత్ర కృత మాయా వనితలను దరికి రానీయ నిరాకరించిన వారువెనుదిరిగి విశ్వామిత్రునకు తమ అవమానము చెప్పికొనగా విశ్వామిత్రుడు క్రుద్ధుడైన సందర్భమున చెప్పిన పద్యమును గనుము.

## అన్నియు నుత్వములు

క॥ ఉఱుకూళుఁడు త్రుళ్ళుచు జు
చ్చుఱుకుం జూడ్కులను జూచుచు దుడుకు దుఱుసున్
దుఱుతు న్నులుసు న్నుదుటుం
గుఱు కూసుచు కూతు లూసుకున్ జూకురు సూ॥

(ని. ని. శా, హరి. ఆశ్వా 2, ప. 71)

టీ॥ ఉఱు కూళుఁడు = కుత్సితుఁడగు (విశ్వామిత్రుఁడు) వాఁడు, త్రుళ్ళుచు = ఎగిరి పడుచు, చుచ్చుఱుకన్ = చుఱ చుఱ మండెడి అనగా నిప్పు కల వంటి, చూడ్కులను కనులతో చూచుచు, దుడుకు = దుష్టమైన, దుఱుసున్ = కాఠిన్యముచే, తుఱుతున్ = వేగిర పాటున, నులుసున్ = న్యూనత లేక అవమానము చే కల్గిన, ఉదుటన్ = ఉద్ధృతమైన, గుఱుకు = గుఱ గుఱ యను కోపముతో, కూతులూసుకున్ కూతుల + ఊసుకున్ = కొమార్తెల ఉబుసునకై, జూకురుసూ = తత్తరపడెనని భావము.

కేశవా : కవి సింహాగ్రణీ! సిద్ధ యోగి చరిత్రలో మీరిది వరకు ప్రబంధాత్మక వర్ణనాదుల చిత్రమేగాక నవదంపతుల మాటలలో కూడ మీ చమత్కృతి చూపినారని విన్నాను, ఆ చమత్కృతి ఎట్టిదో విన కుతూహలము కలదు. అది ఏదో సెలవిత్తురా?

కాశీపతి : కేశవాచార్య! మీ యొక్క జిజ్ఞాసకెంతయో సంతసించుచున్నాను. వివాహానంతరము నవదంపతులైన అచ్చాంబి సిద్ధయోగులను పేరంటాండ్రు ప్రధాన గృహముఖ ద్వారమున నడ్డగించి వారిని తమ తమ ప్రియుల పేర్లు తెల్పుమన్నప్పుడు సిద్ధయోగి ఇట్లు చెప్పినాడు,

క॥ యువతీ రత్నము లారా
ప్రవిమల ముగ మీకు నాదు భార్యాభిఖ్యన్
వివరించెద నాలింపుడు
అవర్ణముఖి యగును నామ మరయంగదరే॥

అని తెల్పినాడు, సిద్ధయోగీంద్రుడేలకో క్రొత్త నామమిడినాడని కొందరు, కళ రహితముఖము గలదని యో అని కొందరు భావించుచు తమ తమ మొగములు జూచు కొనుచుండ నొక చెలి వధువు నామము అవ్వాంబి కదా! ఆ పేరున 'అ' వర్ణము ముఖాక్షరముగా గల్గి యున్నందున నట్లు చమత్కరించి చెప్పినాడని వివరింప నందరు సిద్ధ యార్యుని పాండిత్యమును పొగడి సంతుష్టులైనారు. ఆ పిమ్మట వధువును వరుని పేరు జెప్పుమన నాయమ;

క॥ జాంబూ నద ముకురక్షీ
రాంబుధి వేశ్యల సమాహ్వ యంబులను ద్రివ
ర్ణంబులుగ వ్రాసి నడివ
ర్ణంబులు గైకొన్న నాదు నాథుని పేరౌ॥

అని అవ్వాంబీ తన భర్త పేరు చెప్పెను కాని అది ఎవరికిని అర్థము గాక యోజింపు చుండగా నొక లేమ ఇట్లు వివరించినది జాంబూనద, ముకరము, క్షీరాంబుధి, వేశ్య యను పదములకు అర్థమొసగు మూడేసి యక్షరముల పదములు క్రమముగా వ్రాసి వాని నడిమి అక్షరాలు తీసికొనినచో నాథుని పేరగునని వధువు తెల్పినదని :— వరుసగా —

| | | |
|---|---|---|
| జాంబూ నద | = | పసిడి |
| ముకురము | = | అద్దము |
| క్షీరాంబుధి | = | పయోధి |
| వేశ్య | = | భోగిని |

వీటి నడిమి అక్షరములు సిద్దయోగి యని చమత్కరించి అవ్వాంబీ తెల్పినది. ఇంత భావ గర్భితముగా ఆ నవవధువు చెప్పిన నైపుణ్యమున కందరు ఆశ్చర్యానందము లొందిరి.

ఇట్టిదే మరొకటి వినండి సీతారాముల కల్యాణ సందర్భం - అంగనలు రాముని పేరు చెప్పుమని ప్రశ్నించగా సీత సిగ్గుతో -

కం॥ వరు పేరే మనియె దరా
సరసమ యుక్తంబునైన స్వామి యగు సుడీ!
పరికించి తెలిసికొండని
ధరణీ సుత వ్రీడతోడ తరుణులకనియెన్!

ఇందులో, సాధారణ భావం : వరుని పేరు ఏమని అంటారా! మీా సరసము యుక్తము కాదు. 'స్వామి' అంటారు.

కవి చమత్కృతి; 'రా' సరసన 'మ'యుక్తము అయిన 'స్వామి' అనగా "రామ స్వామి" అని భావగర్భితంగా సీత చేత పలికించాను.

అనంతరం రాముని చేత సీత పేరు చెప్పించిన పద్యం వినండి.

ఆ॥ వె॥ చరణముల కడన్ బొసంగెడు మీాకి సీ
వధువు పేరు దెల్పవలెనె మహిత
నయయటంద్రు గాన నా రాణి పేరు గా
తెలిసికొనుడు మీాకు తెలివి లేదె !

సాధారణ భావం : కాళ్ల దగ్గఱ పడి యుండెడు మీాకు (అనగా చెలికత్తెలకు దాసీ జనులకు) ఇసీ! వధువు పేరు తెలుప వలెనటె! 'మహితనయ' అనగా దొడ్డ నీతి కలది అయిన నా రాణి పేరు గా తెలిసికొనండి! మీాకు తెలివి లేదె!

కవి చమత్కృతి . చరణములకడ పొసంగెడు అనగా పాదముల చివరనున్నదని భావం. "సీత గాదె" అని చమత్కరించి రాముని చేత అనిపించాను.

## కవిసింహ బిరుదము

కేశవా : కవిభ కంఠీరవా! మీారు చూపిన ఏ చమత్కృతి వలన మిమ్మెవరు? ఎప్పుడు 'కవి సింహ' బిరుదముతో నలంకృతుల నొనర్చిరో విన కుతూహలము కల్గుచున్నది వినిపించి ఆనందింపఁ జేయగలరా!

కాశీపతి : రసప్రియా! మీరడిగిన ప్రశ్న కొక చిన్నని సన్నివేశోదంతము కలదు. అదేమనగా నేను "నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానము"ను రచించి గద్వాల ప్రభువులు శ్రీమంత్ మహారాజా శ్రీ సీతా రామ భూపాలరావు బలవంత్ బహద్దురుగారికి కృతి సమర్పణ జేయ సంకల్పించి రాజా వారి ఆస్థానమునకు వ్రాత ప్రతితో వెళ్లి ఈ ప్రబంధమును "మీకు సమర్పింతునని" రాజా వారితో మనవి చేసినాను. సీతారామ భూపాలరావుగారు సంతోషించినారు. కాని, కొందరసూయా గ్రస్తులగు పండితులు ఆ కావ్యమును పరికించి అది నేను వ్రాసి యుండలేదని, ఏ పూర్వకవియో రచించిన దాని నీతడు సేకరించి యుండునని కుచ్చిత బుద్ధిచే "మహా రాజా! మీకే ఈ గ్రంథము నంకితము చేయనెంచిన యెడల, మీ వంశములో నిడివరకెందరో మీ పేరుగలవారు గడచినందున నీ గ్రంథమును ఏ సంవత్సర మందలి సీతారామ భూపాలుని కంకితము చేయ దలచినాడో నిర్దిష్టముగా నొక పద్యము నిరోష్ఠ్యముగా అచ్చ తెలుగున వ్రాసి తేవలసినదిగా, కుట్రబన్ని, రాజావారిచే నర్థింప జేసినారు.

అందుకు సరే! యని నా బసకు వెళ్లినాను, అర్ధరాత్రివరకు ఆలోచించుచునే ఉన్నాను సంవత్సరము దుర్మతి, ఇందు 'ర' కారమునకు 'మ' కారమగు ఓష్ఠ్యము కలదు. శాలివాహన శకమున దంతోష్ఠ్య "వ" కారము వచ్చును. విక్రమార్క శకమనిన నందులో "వ-మ" లు రెండును వచ్చును. ఫసిలీ వాడెడిచో "ఫ" కారమయ్యె పందొమ్మిది వందల క్రీస్తు శకమును స్వీకరించుచో నందులోను ఓష్ఠ్యములు కలవు. ఇట్లాలోచించుచుండగా నెప్పుడో నిద్రపట్టినది.

తెల్లవారి బ్రాహ్మీముహూర్తమున మేల్కొని పద్యము గురించి యోచించుచుండ నొక ఊహ మనసులో మెరుపువలె మెరిసింది; ఊహ తట్టిన తరువాత పద్యమెంత సేపు వ్రాయడానికి, పద్యం పూర్తి చేసి నిత్యకృత్యములు ముగించుకొని రాజా వారి ఆస్థానమును చేరు కొన్నాను. వెంటనే రాజావారు నన్ను చూడగనే "ఏమండీ కవిగారు! పద్యం తెచ్చినారా! చదివి వినిపించుడు" అని అన్నారు. అప్పుడు—

ఆ॥వె॥ "తెల్గు లేచిన్ క స్తి గల్గగా కయిఁజేయ
నేసుక్రీస్తు సనిన యేండ్ల నెన్న
నిందు తొంటి యంజ నెనసిన నాల్గంకె
లేడు తొడరి తీర్చి నాడ దీని"॥

అని పద్యము చదివి వినిపించినాను. అప్పటి ఆ పండితులు "అయ్యా! పద్యమైతె వ్రాసినారు కాని అందులో ఏ సంవత్సరము లేదని అధిక్షేపించినారు, అప్పుడు పద్యము యొక్క పదవిభజన చేసి ఇట్లు చూపినాను

తెల్గు లేచిన = తెలుగు శబ్దముల నేరుకొని
క స్తి గల్గగా = కష్టము గలుగునట్లుగా
కయిఁజేయ = కవిత్వం చేసే నిమిత్తం
ఏసుక్రీస్తు సనిన = ఏసుక్రీస్తు అనంతరం
ఏండ్ల నెన్న = సంవత్సరాలను లెక్కించగా
ఇందు = ఈ పద్యములో
తొంటియంజన్ = మొదటి పాదమునందు
ఎనసిన = పొంది నటువంటి
నాల్గంకె లేడు = నాలుగు అంకెలు గల సంవత్సరము
తొడరి = యత్నించి
దీని తీర్చినాడ = దీని తీర్మానించినాడను

అప్పటికిని అట కూడిన పండితుల గుంపులో నెవరికిని సంవత్సర మేదో అర్థము కాలేదు. అప్పుడు నల్లబల్ల, సుద్ద ముక్క తెప్పించి "తొంటి యంజ నెన సిన నాల్గంకెలేడు" అనునది వ్రాసి ఇట్లు చూపినాను.

తెలు ౧ (1) | లేచిన వలపల గిలక (9) | కసి ౨ (2) | గల ౧ గా (1) | కయిఁ జేయ

1 9 2 1

అని ఈ అంకెల అనగా క్రీ.శ. 1921 లో గల సీతారామ భూపాలునికి అంకితం చేయదలచినాడనని విశద పరచనైనది.

అప్పుడు రాజావారు నా చమత్కృతిని మెచ్చుకొని "కవిసింహ" బిరుదముతో ప్రశంసిస్తూ నాకు ఒక యోగ్యతా పత్రమును బహూకరించినారు.

"ఏనాఽ శౌరి విచిత్రం
నిరోష్ఠ్య శబ్దాఽఽ న్వి చరిత మతి విపులమ్
తస్మై దదామి నామ
శ్రీమత్కవిసింహ ఇతి జనాః శృణుత"

మరియు వేయి నూటపదహారులతోను భూదాన పత్రంతోను ఘనంగా సత్కరించినారు. ఇది నా "కవిసింహ" బిరుదము వెనుక గల విస్మరింప రాని ఉదంతము.

## స్వాతిశయము కాని వాస్తవికత

కేశవా : గురుదేవా! మీరు నిష్కేవల స్వర, నిర్బిందు, నిష్పంచ వర్గ, నిర్గద్య, దశాక్షరీయ శ్రీశౌరిశైశవలీల కావ్యావతారికలో మీ కవితా శక్తిని గూర్చి చెప్పికొన్న పద్యము మీ స్వాతిశయమని కొందరు భావింతురు. ఒక సారి ఆ పద్యమును వినిపించి అర్థం వివరిస్తే వినాలని కుతూహలము కలదు. అనుగ్రహిస్తారా!

కాశీపతి : అవధరింపుము రసప్రియా!

సీ॥ శ్రీ హరిశ్చంద్ర చరిత్రచే నోరులు గాం
చగ నోట్లు దెఱిపింతు చదువరులను
పృథుల సారంగధరీయంబుచే మూడు
త్రోవలు బట్టింతు కోవిదులను
సిద్ధయోగిచరిత్రచే గర్వభంగ మొ
నర్చి జోగుల జేతు నవరసికుల

నల త్రింశదర్థ పద్యమణిచే లోఁబర్చు
కొందును ముప్పది మంది బుధుల
సరవి నీ శౌరిశైశవలీలచే ముక్కుఁ
బట్టి యాడింతును పండితులను

గీ॥ చాటువులచేత నాల్కను సాఁచజేతు,
నోరు మూయింతుఁ గొన్నిట సూరి జనుల
చేతి కలముల బెట్టింతు వ్రాతకాంద్ర
మత్కవిత సారమౌ హనుమంత భూప!

అర్థములు వినండి.

1. నా హరిశ్చంద్రోపాఖ్యానము నిరోష్ఠ్య కావ్యం. పండితులాశ్చర్య పడే టట్లు రచించినానని ఒక అర్థం. పెదవికి పెదవి తగలని రీతి నోరు తెఱచి చదువునట్లు రచించితిని ఇందతియోక్తి యేమున్నది.

2. నా సారంగధరీయము త్ర్యర్థికావ్యమగుటవల్ల చదివిన వారిని తికమక పరుస్తానని ఒక అర్థం శివ, చంద్ర, సారంగధరుల కథలననుసరించి మూడు మార్గాలలో ఆలోచించేటట్లు చేస్తానని మరొక అర్థం.

3. నా సిద్ధయోగి చరిత్రము వేదాంత గ్రంథం. చదివిన రసికావతంసులకు కూడ గర్వభంగం చేస్తానని ఒక అర్థం. వేదాంత గ్రంథమగుట వలన చదివిన రసికులు జోగులనగా యోగులై పోతారని ఒక అర్థం.

4. నా త్రింశదర్థ పద్యరత్నం ముప్పది అర్థములు గల పద్యము కావున ముప్పది అర్థాలతో పండితుల మన్ననలను పొందుతానని ఒక అర్థం. ముప్పది మంది బుధులను అనగా దేవతలను స్మరణజేసి లోబరచుకొంటా నని మరొక అర్థం

5. నా శ్రీశౌరి శైశవలీల యంతయు అనునాసికాదులు లేని దగుటచే పండి తుల ముక్కుపట్టి ఆడిస్తానని, అనగా ముక్కుపట్టి పలికిస్తానని యొక అర్థం. ముక్కు మూసికొని చదువనొప్పునట్లు రూపొందించితినని మరొక అర్థం.

6. చాటువులచేత పండితులను విస్మయచకితుల చేస్తానని ఒక అర్థం. చిత్ర కవితా భాగమున సోష్ఠ్యములు లేదా అచల జిహ్వికలను పద్యములను నాలుక చాచి కదలనీయక చదువ వీలగునట్లు చేస్తానని మరొక అర్థం.

7. నోరు మూయింతుననగా కొన్ని పద్యములు నోరు మూసికొని చదువ వీలగునట్లు రచించితి కాన పండితుల నోరెత్తకుండ చేస్తానని ఒక అర్థం, ఏకాక్షరులను చెప్పి నోరు మూసికొని కూడ వాటిని చదివిస్తానని మరొక అర్థం.

8. చేతి కలమిల బెట్టింతుననగా నేను కవనం చెపుతుంటె నాతో పోటీ పడ లేని వ్రాతకాండ్ర కలములు భూమిపై పడవేసేటట్లు చేస్తానని ఒక అర్థం. వారు నా కవితా వేగానికి సరిరాకుండునట్లు గంటకు నూరు -100- పద్యాలు వడివడిగా ఆశువుగా చెప్పి ఓడిస్తానని మరొక అర్థం.

9. మత్కవిత సారమౌ అనగా స+అరమౌ వేగముతో కూడిన దైనందున గంటకిన్నూరు పద్యములు చెప్పు నా ఆశు కవితాధోరణి మీరెరిగినదే కదా కవిచంద్రా!

చమత్కారము తప్ప ఇందులో నా స్వాతిశయమేమున్నది.

కేశవాచారి : శివ చంద్ర సారంగధరులను మూడు పేర్లు వచ్చే అట్లుగా "సారంగధరీయం" అని కావ్యానికి నామకరణం చేసినారు. మీ రచనా శిల్పానికి రసజ్ఞుడైన రాజావారు ముగ్ధుడై కవిగారూ! గ్రంథం వ్రాసి పేరు పెట్టినారా లేక పేరుపెట్టి గ్రంథం వ్రాసి నారా!" అని చమత్కరించినారట. అట్టి మహాకావ్యం నుండి ఒక పద్యం మచ్చుసకు మూడర్థాలు మీ ముఖత వినాలని కుతూహలంగా వుంది. దయచేసి చెప్పండి గురువర్యా!

కాశీపత్యవధాని : సారంగధరీయంలో మూడర్థాలు వచ్చే అట్లు ఒక చిన్న పద్యం వినండి.

గీ॥ అకట సారంగధరుఁడు చిత్రాంగి నార్య
నన్నుఁ జేరఁగనేల వద్దన్నఁ గాని
వానినే గోరనేల నా పతి యెఱిగియు
నిట్లు వానికిఁ జేయఁగా నేల సఖియ॥

టీ॥ : శివ : సఖియ = ఓహితురాలా, సారంగధరుడు = శంకరుడు, చిత్రాంగిన్ = అరుదైన అవయవములు గల దానిని, ఆర్యన్ = పార్వతిని, అన్నున్ = పారవశ్యము నొందిన స్త్రీని, చేరగనేల = సమీపింప నేటికి, వద్దన్నగాని = శంకరుడు బైరాగి వేషమున వచ్చి శివుడు నీకు దగినవాడు కాడని అని నప్పటికిని, వానినేగోరనేల = ఆ శంకరునే గోరనేటికి, నా పతియెఱిగియున్ = నా భర్తయైన హిమవంతుఁడు శివుఁ డెంతటివాడైనది యెటిగియును, (అనగా బీదవాడని యనుట), ఇట్లున్ = ఈ విధముగా,వానికిఁ జేయగానేల = ఆ శంకరునికి బిడ్డ నిచ్చి వివాహము సేయబూన నేటికి, అకట = విచారకరము.

చంద్ర : సఖియ = ఓ హితురాలా, సారంగధరుడు = చంద్రుడు, చిత్రాంగిన్ = చిత్రావయవములు గల దానిని. ఆర్యన్ = పది యారేండ్ల వడుచును, నన్ను జేరగనేల = నా దగ్గర జేరి యుండ నేటికి, వద్దన్నఁగాని = వలదని చెప్పినను, వానినే గోరనేల = నే నా చంద్రుని గోరనేటికి. నా పతియెఱిగియున్ = నా భర్తయైన బృహస్పతి తెలిసికొనిన వాడై, ఇట్లువానికి జేయగానేల = ఈ విధముగా నా చంద్రునకు నపకృతి జేయ నేటికి, అకట = విచారము.

సారంగ : సఖియ = ఓ ప్రియురాలా! సారంగధరుఁడు = రా కుమారుడు, చిత్రాంగిన్ = నా సవతియైన చిత్రాంగిని, ఆర్యన్ = పది యారేండ్ల వడుచు దానిని, అన్నున్ = పారవశ్యము నొందినస్త్రీని, చేరగనేల = సమీపింప నేటికి, వద్దన్నఁగాని = భావ్యము గాదనివలదనినప్పటి కిని, వానినేగోరనేల = అట్లు వలదని వానినే గోరనేటికి, నా పతి యెఱిగియున్ = నా భర్తయైన రాజ నరేంద్రుడెవరి గుణమెట్టిదైనది తెలిసినవాడయ్యును, ఇట్లువానికి జేయనేల = ఈ విధముగా వానిని చెఱసాల పాలు జేయనేటికి, అకట = విచారకరము.

(శివ కథలో మేనక విచారము, చంద్ర కథలో తారా విచారము, సారంగధరలో రత్నాంగి-విచారము నగు మూడు విభిన్న భావములను నొకే పద్యమున రచింపబడినది. ఇట్లే గ్రంథమంతయు కలదు)

**కేశవా :** గురుదేవా! వేదాంత గ్రంథమైన సిద్ధయోగి చరిత్రలో ప్రాణాయామ యోగలక్షణము తెలియపరచినారు కదా! అనుగ్రహించి ఆ పద్యము చెప్పండి. మీ ముఖతః వినాలని కోరిక.

**కాశీపతి :** అలాగే! వినుము నవరసికుల జోగుల చేత నన్నందుకు – రేచక పూరక కుంభకముల నభ్యసించిన వారలు యోగులు కాకుందురా. నాడా సిద్ధనికి శ్రీమద్విరాడ్వీర బ్రహ్మేంద్ర స్వాముల వారు బోధించిన ప్రాణాయామ యోగలక్షణమును ఈ పద్యమున దెల్పితిని

మ॥ హొలుపౌ గాలిని వామనాసికమునన్ బూరింపుచున్ దానిలో
పల నర్ధంబును కుంభకంబు వలనొప్పన్ జేయుచున్ శేషము
న్వెలయన్ దక్షిణనాసికంబు వలన రేచింపుచున్ దీక్షతో
నలువొందన్ పరమాత్మ నారయుట ప్రాణాయామమౌ నందనా॥

టీ॥ హొలుపౌ గాలిని=శ్వాస నిశ్వాసలలో నొప్ప గాలిని అనగా వాయువును, వామనాసికమునన్=ఎడమ ముక్కు నుండి, పూరింపుచున్=నిండింపుచు అనగా పీల్చుచు, దానిలోపల నర్ధంబును = ఆ పీల్చిన గాలిలో సగమును, కుంభకంబున్=బిగబట్టి లోననే ఇముడునట్లు, వలనొప్పన్ జేయుచున్=యుక్తమగు రీతిని జేయుచు, శేషమున్=బిగబట్టగా మిగిలిన సగమువాయువును, వెలయన్=ప్రకాశించునట్లుగా, దక్షిణ నాసికంబు వలనన్ = కుడి ముక్కు పుటము ద్వారా, రేచింపుచున్ = బయటకు వదలుతు, దీక్షతోన్ = పట్టుదలతో, నలువొందన్=నేర్పు దీపింపగా ననగా శోభిల్లగా, పరమాత్మ నారయుట = అంతరాత్మనులో చూపుతో చూచుటయే, నందనా=కుమారా! ప్రాణాయామమౌన్=అష్టాంగ యోగములలో నొకటగు ప్రాణాయామ యోగమగును.

**-: బహుళార్థ పద్యము :-**

**కేశవా :** మహా కవి శేఖరా! ఒకప్పుడు విద్వద్గద్వాల సంస్థానాధీశ్వరుండైన శ్రీమంత మహా రాజా ముష్టిపల్లి శ్రీ సీతారామ భూపాలరావు బలవంత్ బహద్దురుగారు మిమ్ముగాంచి ఓ కవీంద్రా! తెనాలి రామకృష్ణ కవి (అతివ కచ నాభి గళ) అని ప్రారంభించిచి త్ర విచిత్ర

గతుల రచించిన పద్యమును బోలునట్టు లీనాటి కవులగు మీరు రచింపఁగలరా యని ప్రశ్నింప ప్రయత్నించి చూచెదనని, మీరు రచించి రాజావారికి వివరించి వినిపించిన చిత్రమగు బహుళార్థ పద్యమును వినమనంబుత్సహించుచున్నది. అది వినిపించి ఆనందింపజేయ ప్రార్థన.

కాశీపతి : రసప్రియా! మీలోని రస పిపాసత్వమున కెంతయో మనంబలరుచున్నది. అట్టి మీ తృష్ణను తీర్పకుందునా! వినుడు.

## -: స్త్రీ వర్ణనము :-

1. గీతమాలిక : 1 చెలి వచోధీ కపోలాస్యముల నెదిర్చి
"ఘనవసు మహీ నగజవార్జ" గణములోఁగెఁ,
2 బూన్కి జతలై యనంతంబుగా నెదిర్చి
సకియ కచ దేహ కటి కుచేష్టముల కొగ్గె,
3 నంత సాంతము ముఖ భంగమయ్యెదిర్చి
వాన శ్రుతి సౌరభ వలగ్న యాన కంఠ
ములకు లొంగెను, | దలకొని మొగిసి యరసి
4 ఆది మధ్యాంతములు లేక యతిచతురిత
మరల నెదిరించి సతి సౌకుమార్యమునకు
చేడె కరతల శోభకు నోడె, | మఱియు
5 నన్ని వర్ణము లొగిజేరి యా వెలంది
నించుక యెదుర్ప లేక చాలించికొనియె,
6 నపుడు ఘనవసు రహితలై యందుఁ గల్గు
పొలతు లామెకు నెందునన్ బోలమనుచు
సిగ్గుపడి యాశ్రయించి యా చెలువవెంత
నుండి రేమందు. నౌర యా యువతి సొగసు॥

టీ : 1. చెలి = ఆ స్త్రీ యొక్క, వచః = వాక్కులతోను, ధీ = బుద్ధితోను, కపోల = చెక్కిళ్లతోను, ఆస్య = ముఖముతోను, ఎదిరించి; ఘనవసు = అతి మధురము, మహీ = ధేనువు (అనగా గోవు అనుట), నగజ = అభ్రకము, వార్జ = పద్మము మొదలైన, గణము = సముదాయము. లోగెన్ = లొంగిపోయెను (అనగా నా స్త్రీ యొక్క పల్కుల తియ్య దనమునకు నతి మధురమున్ను, ఆమె బుద్ధి సాధుత్వమునకు ధేనువున్ను, ఆమె చెక్కిళ్ళ తళుకునకు నభ్రకమున్ను, ఆమె ముఖకాంతికి పద్మమున్ను ఎదిరించి సరికాక లొంగిపోయెనని తాత్పర్యము

2. పూన్కిన్ = మరల పట్టుదలలో, జతలై = జంటలై, (అనగా రెండు రెండక్షరములై యనుట,) అనంతంబుగాన్ = అంతు లేనట్లుగా నని యును - చివరయక్షరమగు "ర్జ" యనునది లేనట్లుగా ననియును, ఎదిర్చి = ఎదిరించి, సకియ = ఆ చెలియొక్క, కచ = కురులకును, దేహ = శరీరమునకును, కటి = పిరుదునకును, కుచ = స్తనములకును, ఓష్ఠ = పెదవులకును, ఒగెన్ = తగ్గిపోయెను, జతలై యనగా 'ఘన-వసు-మహీ-నగ-జవా' అని రెండు రెండక్షరముల జంటలై, చివరి యక్షరమగు (ర్జ) యను దానిని సంకరాక్షరమనియో యేమో వదలు కొనుటచే ఆమె కురులయంత నల్లదనము లేక ఘన = మేఘమున్ను, ఆమె శరీర కాంతిని బోలక, వసు = బంగారమున్ను, ఆమె పిరుదుల వలెవైశాల్యములేక, మహీ = భూమియున్ను, ఆమె చనులవలె నున్నత స్థితి లేక నగ = పర్వతములున్ను, ఆమె పెదవులవలె నెఱ్ఱదనము లేక జవా = దాసన పుష్పమున్ను, జతలై సమూహముగా నెదిరించి లొంగి పోయెనని తాత్పర్యము.

3. అంతన్ = తదుపరి, సాంతమున్ = అఘనాదులు మొత్తమున్ను, ముఖ భంగమయ్యున్ = పరాభవమొందియును అనియును, సాంతమున్ = అంతముతో గూడి (అనగా ద్వివర్ణ విలసితయనియో యేమో విడిచిన చివరదియైన-ర్జ-అను నక్షరముతో గూడి), ముఖ భంగమయ్యున్ =

పరాభవమై కూడా అనియును, కఠినముగా బల్కబడునది యనియో యేమో, ముఖాక్షరమగు "ఘ" అనునది లేనట్లుగాననియును. ఎదిర్చి = ఎదుర్కొని, బాల = ఆ చేడియయొక్క, శ్రుతి = చెవులకును, సౌరభ = పరిమళమునకును, వలగ్న = నడుమునకును, యాన = నడకలకును. కంఠ = గొంతునకును, వరుసగా, నవ = తొమ్మిది సంఖ్యయున్ను, సుమ = పుష్పమున్ను, హీన = స్వల్పార్థమున్న. గజ = ఏనుగున్ను, వార్జ = శంఖమున్ను, లొంగెన్ = లోగిపోయెను, అనగా నామె చెవుల హంకమును బోలక తొమ్మిది సంఖ్యయున్ను, ఆమె దేహ పరిమళమును బోలక పుష్పమున్ను, ఆమె నడుము సన్నమును బోలక హీన శబ్దార్థమున్ను, ఆమె మందగమనమును బోలక ఏనుగున్ను, ఆమె కంఠస్వరమును బోలక శంఖమున్ను లొంగిపోయెనని తాత్పర్యము.

.. తలకొని = పూనుకొని యనియును,-వదలిపెట్టిన తలకట్టైన "ఘ"యను నక్షరమును గైకొనియనియును, మొగిసి = మోహరించి, అరసి = బాగుగా నాలోచించి, ఆదిమధ్యాంతములు లేక = మొదటిదైన "ఘ" యను నక్షరమున్ను, మధ్య = నడిమి యక్షరమగు "హీ" యనునది కూడా కఠినముగా పల్కబడునది యనియో యేమో దానినిన్ని, అంతము లేక = చివరిదగు 'ర్జ' అను నక్షరము లేనట్లుగా, అతిచతురతన్ = మిక్కిలి చాతుర్యముగా ననియును - అతిశయముగా నాల్గేసి యక్షరములై యనియును అనగా నాది మధ్యాంతాక్షరములు పోగా మిగిలినవి నాల్గేసి యక్షరములు కాగా నవసుమ, నగజవా, యని నిల్చెను అవి మరల నెదిరించి = మళ్ళీ యెదుర్కొని, సతి = ఆ సాధ్వియొక్క, సౌకుమార్యమునకున్ = కోమలత్వమునకు, నవసుమ = నూతన పుష్పమున్ను, చేడె = ఆ యింతియొక్క, కరతల శోభకు = అరచేతుల కాంతికి, నగజవా = కొండదాసన పువ్వున్ను, సరిరాక ఓడెన్ = ఓడిపోయెను, అనగా తలకట్టైన (ఘ) అను నక్షరమును గైకొని బాగుగా నాలోచించి ఇదియును సరిపోదని ఆది మధ్యాంతాక్షరములగు "ఘ-హీ-ర్జ" అనునవి లేనట్లుగా, "నవసుమ-నగజవా" అని నాల్గేసి యక్ష

రములతో మరల యెదిరించి ఆమె కోమలత్వమునకు సరిరాక నూతన పుష్పమున్ను, ఆమె అరచేతుల యెఱుపునకు దీటు రాకకొండదాసన పువున్ను ఓడిపోయెను అని తాత్పర్యము.

5. వఱియున్ = మళ్ళీకూడ, అన్నివర్ణము లొగిఁజేరి = అన్నిజాతులవారు క్రమముగాఁ జేరుకొని యనియును, వదలుకొనిన ఘ-హీ-ర్జ అను నక్షరములు యథాస్థానములఁ జేరుకొని యనియును, ఆవెలందినించుక యెదుర్ప లేక = ఆమెను కొంచెమైనను మార్కొనజాలక, చాలించుకొని యెన్ = విరమించుకొనియెను.

6 అపుడు = ఆ సమయమున, ఘనవసు రహితలై = అధికమైన కలావిహీనలై అనియును, "ఘనవసు" అను శబ్దము లేకుండునట్లుగాననియును అందుగల్గు = అచ్చోట నుండిన అనియును, - ఆ వాక్యములోనుండిన యనియును, పొలతులు = స్త్రీలు అనగా మహీ = భూదేవియును, నగజ = పార్వతీదేవియును, వార్జ = లక్ష్మీదేవియును, ఆమెకునెందునఁ బోలమనుచున్ = ఆయమకు నే విధమునను సరిపోమనుచు, సిగ్గుపడి = లజ్జనొందిన వారలై, ఆశ్రయించి = శరణుఁజొచ్చి, ఆ చెలువ చెంత నుండిరి = ఆ విలాసవతి యొద్దనే యుండిన వారలైరి, ఔర = ఆశ్చర్యము, ఆ యువతి సొగసున్ = ఆ జవ్వని సౌందర్యమును, ఏమందున్ = ఏమని చెప్పుదును అనగా చెప్ప సాధ్యము కాదనుట, లక్ష్మికి కమల, పద్మనామములున్నవి, కాన వార్జనామము, పర్యాయ పదమని గ్రహించునది.

కేశవా : మహాకవి శేఖరా! మీ చమత్కృతినెంత విన్నను తనవి తీరకున్నది. ఇంకా వినవలెననియే కోరిక ఉబలాటపడును. మీరు ఒకే ఒక చిన్నని ఆటవెలది పద్యమున ముప్పదర్థములతో ముప్పదుగురు దేవతలను స్తుతించినట్లు పైన నొకచో తెల్పితిరి. ఆ పద్యమేదో వినిపించి నన్ను పునీతుని జేతురా గురుదేవా!

కాశీపతి : నేను నీ ఉత్సుకతను నణచివేయుదునా రసప్రియా! నీవడిగిన త్రింశదర్థ పద్యమిది నాయానా!

## త్రింశదర్థ పద్యరత్నము

ఆ॥వె॥ భూరి జఠర గురుఁడు నీరజాంబక భూతి
మహిత కరుఁ డహీన మణికలాపుఁ
డలఘు సద్గణేపఁ డగ్రగోపుఁడు మహా
మర్త్యసింహుఁడేలు మనల నెపుడు॥

ఇందలి ముప్పదర్థములు వివరించి చెప్పవలెనంటె చాలా కాలముపట్టును. కాన "త్రింశదర్థ పద్యరత్న"మని ప్రత్యేకముగా సటీక-సవ్యాఖ్యానముతోనొక పుస్తకమే ముద్రించి ప్రచురింపబడినది.

దీనికే మెచ్చి శ్రీ హాల హర్వి హనుమంతరెడ్డిగారు నాకు ది. 2-6-1966 న కనకాభిషేకము వైభవోపేతముగా గావించిరి.

ముప్పదర్థములకు మూడర్థములనైనను వివరించెద నాలింపుడు.

### —: బ్రహ్మస్తుతి :—

టీ॥ భూరి = బంగారును, జఠర = పొట్టగాగల, గురుడు = గొప్పవాడును (కనకగర్భుడనుట), నీరజాంబక = కమలాక్షుడైన విష్ణునకు, భూతి = పుట్టినవాడును (విష్ణునాభికమలమందు పుట్టిన వాడనుట), మహిత = అధికమైన, కరుడు = చేతులుగలవాడును (ఎనిమిది చేతులుగలవాడనుట), అహీన = ఘనతరమైన, మణి కలాపుడు = మణిభూషలు గలవాడును (స్ఫటికాక్షమాలికాదులనుట), అలఘు = అతిశయమైన, సద్గణేశుడు = మరీచి, అత్రి అంగీరసాది సద్గణమున కధీశుడైనవాడును, అగ్ర = మొదటివియగు, గో = పలుకులకు (తొలిపలుకులు వేదములనుట) ప = పతియైనవాడును, మహా = గొప్పయైన, అమర్త్యసింహుడు = దేవతా శ్రేష్ఠుడైన బ్రహ్మదేవుడు (సుర జ్యేష్ఠుడనుట) ఏలు మనలనెపుడున్ = నిరంతరము మనల నేలుగాత.

## —: విష్ణుస్తుతి :—

టీ॥ భూరి జఠర = కనక గర్భుడైన బ్రహ్మకు, గురుడు = తండ్రియైనవాడును నీరజ = పద్మములవంటి, అంబకభూతి = నేత్రసంపద గలవాడును, మహితకరుడు = అతిశయమైన చేతులు గలవాడును (ఆజానుబాహుడును చతుర్భుజుడైనందుననుట) అహీన = ఘనతరమైన, మణికలాపుడు = కౌస్తుభాది మణిభూషలు కలవాడును, అలఘు = అధికులైన, సద్గణేశుడు = సాధు గణముల కదీశుడైనవాడును (నారదప్రహ్లాదాదుల కనుట) మహా = గొప్పయైన, మర్త్యసింహుడు = నరసింహుడైన శ్రీమన్నారాయణుడు మనల నిరంతరము పాలించును గాక.

## —: మహేశ్వర స్తుతి :—

టీ॥ భూరి = గొప్పయైన, జఠర = పొట్టగల విఘ్నేశ్వరునకు, గురుడు = తండ్రియైన వాడును, నీర = ఉదకమందున, జ = పుట్టిన యగ్నిని, అంబకభూతి = నేత్ర సంపదగలవాడును, మహిత = శూలమును, కరుడు = హస్తమందు గలవాడును, అహి = సర్పములకు, ఇనమణి = ప్రభుశ్రేష్ఠుడైన శేషుని, కలాపుడు = భూషణముగా గలవాడును, అలఘు = అతిశయమయిన, సద్గణేశుడు = శ్రేష్ఠమైన ప్రమథుల కధీశుడైన వాడును, అగ్ర = చివరిదియగు, గో = దిక్కునకు (ఈశాన్యమునకనుట), పుడు = పతియైనవాడును, మహా = గొప్పయైన, అమర్త్యసింహుడు = దేవశ్రేష్ఠుడు (మహా దేవుడనుట) మనల నిరంతరము పాలించును గాక. ఇట్లు ముప్పదియర్థములతో భాసిల్లుట తామెరిగిన విషయమే యైయున్నది.

కేశవాచారి : మహాకవి శేఖరా! సుప్రసిద్ధ జీవితచరిత్ర రచనా ప్రవీణుడును ప్రవీణుడును విమర్శకరత్న బిరుదాంచితుడును అగు శ్రీ త్రిపుర నేని సుబ్బారావుగారికి మీరంకితమిచ్చిన శ్రీశైల మల్లేశ్వర శతకమందు కృతిపతి ప్రశంసలో వారి వివాహ సందర్భమును పురస్కరించుకొని అక్షరాల వత్తులలో చెప్పిన చమత్కార పద్యమును వినిపించి వివరించ ప్రార్థన.

కాశీపతి : అవధరింపుము రసప్రియా!

ఆ॥వె॥ అగికసఁ నమ్మ నక్కరతోఁజేసి
పూని పెండ్లిఁ ద్రిపురనేని సుబ్బ
రావు దీని మొదటి రాణింపదగు హూణ
శకశతాబ్ద మధ్య జరుపుకొనియె.

శ్రీ త్రిపురనేని సుబ్బారావు శ్రద్ధతో హోమాది సత్కారములనుచేసి దీని మొదట = ఈ పద్యము మొదటి పాదమున, రాణింప = ఒప్పుచున్న, హూణశక శతాబ్ద = క్రీస్తుశకశతాబ్దమున, పెండ్లిజరుపుకొనెను. అది ఏ సంవత్సరమున మొదటి పాదమునగల —

| | | | | |
|---|---|---|---|---|
| "అగ్గి"లోని గికారద్విత్వము | (౧) | తెలుగున | ఒకటి | = 1 |
| "కసఁ" లోని వలపలగిలక | (౯) | ,, | తొమ్మిది | = 9 |
| "నమ్మ"లోని మకార ద్విత్వము | (౪) | ,, | నాలుగు | = 4 |
| "అక్కర" లోని కకార ద్విత్వము | (౮) | ,, | ఎనిమిది | = 8 |

అగును అనగా 1948 వ సంవత్సరము క్రీస్తుశకమున వివాహమయ్యె నని సంవత్సరము ఈ పద్యమున పొందుపరుపబడినదని తెలిసికొనవలెను.

కేశవ : మహాకవి శేఖరా! సారంగధరీయంలో విరహిణీ శత్రువులైన మన్మథా దుల బాధా నివారణార్థము ఈశ్వరుని స్మరించిన విధానంలో మీరు కనపరచిన శబ్ద చమత్కారం విని ఆనందించాలని ఉంది. దయతో ఆ సన్నివేశంలో చెప్పిన పద్యాలు వినిపించి వివరించగలరా!

కాశీపతి : అలాగే నాయనా! అవధరింపుము. చెలికత్తెలు విరహాతప్తయైన తమ దేవికి శీతలోపచారాలు చేశారు. తాపమే మాత్రం తగ్గలేదు. ఒక చెలికత్తె ఈశ్వరుని స్మరిస్తే మదనుడు పారిపోతాడు. కాని స్మరించడంలో మెలకువ పాటించాలి అని ఇట్లా సలహా ఇస్తుంది

సీ॥ విషమాంబకా! యని వినుతింతమందమా
యిది దర్పకుని నామమింతులార
ఓ సదాగతి! మమ్ము నోముమటందమా
యిది గంధవహు నామమింతులార
ఏణధరా! యని యెన్నుదమందమా
యిది నిశాకర నామమింతులార
అబ్జాంబ కాప్తా! యటంచు ప్రార్థింతమా
యిది మధుయుక్తాఖ్య యింతులార

గీ॥ కాన మన్మథ శోష! నాగ వరభూష!
రాత్రి చరజైత్ర! మధువైరి మిత్ర! యనుచు
శంకరుని వేడ విరహిణీ శత్రులైన
వారి దర్పములుడుగు వేర్వేరసుండి!!

టీ॥ తా॥ : విషమాంబకా = విషమ = సమముగాని, అంబక = నేత్రములు గలవాడా (బేసి కంటీ) అని వినుతింతమందమా ఇది దర్పకుని నామము (మన్మథుని నామము) దర్పకుడు = గర్విష్ఠుడు, మన్మథుడు ఎట్లన విషమ = సమముగాని, అంబక = బాణములు గలవాడా (పంచశరాయని నామముండుటచే మన్మథనామమగును.)

ఓ సదాగతి = ఓ పరమేశ్వరా, మమ్ము నోముమటందమా = మమ్ములను రక్షించుమని యందామా అంటే అది గంధవహునామము అనగా మదమెక్కిన వాని నామము, గంధవహుడు = వాయుదేవుడు (ని. స్వశనః స్పర్శనో వాయుర్మాతరిశ్వా సదాగతిః అని అమరం)

ఏణధరా = జింకతాల్పరీ (శంకరా) అని ఎన్నుద పుందమా అంటే ఇది నిశాకర నామము అనగా చంద్రనామము (చంద్రుడు జింకతాల్పరి యగుట)

అబ్జాంబకాప్తా = కమలాక్షుడైన విష్ణునకు మిత్రమా (ఈశ్వరా) అని ప్రార్థింతమా అంటే ఇది మధు యుక్తాఖ్యా = కల్లుతో కూడుకొనబడిన వానిపేరు (త్రాగుబోతు పేరు) వసంతునకు దగిన నామము. ఎట్లన, అబ్జ = కమలంబులను, అంబకా = బాణములుగా గల మన్మథునకు, ఆప్త = స్నేహితుడైనవాడా అనగా వసంతునకు తగిన నామము, కాన = కావున, మన్మథశోష = మదనుని క్షయింపజేసినవాడా, నాగవరభూష = ఆదిశేషుని భూషణముగా గలవాడా, రాత్రి చరజైత్ర = రేద్రిమ్మ రీడుల జయించినవాడా (రాక్షసులననుట), మధువైరి = మదనునకు శత్రువైన విష్ణునకు, మిత్ర = స్నేహితుడుగా గలవాడా (ఈశ్వరుడా) అనుచు శంకరుని వేడ = ఈశ్వరుని నుతించినట్లైతే, విరహిణి శత్రులైన వారి దర్పములుడుగు వెర్వేరసుండి = (విరహమునొందిన వారలకు వైరులగు మన్మధుడును, వాయు దేవుడును, చంద్రుడును, వసంతుడును దర్పరహితులగుదురు). మన్మథ శోష యనుటతో మన్మథుని దర్పమడుగును. నాగవరభూషయనుటతో తనను భక్షించు శేషుని భూషణముగా గలవాడని వాయుదేవుని దర్పమడుగును, రాత్రిచరజైత్ర యనుటతో నేనును రాత్రి చరించువాడనే అని చంద్రుని దర్పనుడగును. మధు వైరిమిత్ర అనుటతో మధునామము గలవారికి శత్రువైన వానిని మిత్రుడుగా గలవాడని తోచి నేనును మధుడనే యగుదునని వసంతుని దర్పమడుగును. కావున శంకరుని యీ విధముగా నుతించవలయునుగాని, విషమాంబకా, సదాగతి, ఏణధరా, అబ్జాంబకాప్తా; అనినుతించినచో వరుసగా మన్మథ వాయు చంద్ర వసంతనామముల తలంపుజేసిన వారమగుదుము. కాన విరహిణీ శత్రు వులైన మన్మథాదుల నామములుచ్చరింపరాదని ఆ చెలికత్తె తాను తెలిసినదాని వలె చెప్పెను అంత మరొకతె ముందుకు వచ్చి శంకరుని అన్ని పేర్ల దలప జ్ఞాపకమెవరికుండును ఒక్కపేరు చాలదే విరహిణీ వైరులనెల్ల పారద్రోలగ అని అంటుంది. అది ఎట్లన.

గీ॥ సతి మనుపరావె 'మధువైరిశరధర' యని
పిలుతమివ్వేళ నాతని పేరుఁ దలఁచు
మాత్రనే పక్షులు, మధుండు మరుఁ డనిలుండు
సరగ నతిభీతి విముఖతఁ జనుట నిజము.

(సార-ఆశ్వా 3, ప. 24)

టీక : సతిన్ = ఈ సాధ్విని, (శివకథలో మాత్రము ఈ పార్వతిని అని గ్రహించునది. మధువైరి శరధర = ఓ ఈశ్వరా, మనుపరావే = రక్షింపరాగదే, అని పిలుతమివ్వేళన్ = ఈసమయమునందున ఆహ్వానింతాము. అతని పేరు దలచుమాత్రనే = ఆ శంకరుని నామము గొనియాడిన మాత్రము చేతనే, పక్షులు = శుకపికాది విహంగములు. మధుండు = వసంతుడు, మరుడు = మన్మథుడు, అనిలుడు = వాయుదేవుడు, సరగన్ = తీవ్రముగా, అతిభీతిన్ = మిక్కిలి భయముతో, విముఖతన్ = వెనుకకు మరలిన వారలై, చనుట = పోవుట, నిజము వాస్తవము.

తా॥ మధువైరి శరధర అని పిలిచినచో బాణములు ధరించిన శంకరుడు వచ్చి మమ్మెక్కుపెట్టి వేయునేయోయని పక్షులును, మధునకు శత్రువైన విష్ణువును బాణముగా ధరించిన శంకరుడు వచ్చునేమో నేనును మధుడనే యగుదునేయని వసంతుడను (లేక మధువైరియగు విష్ణువుయొక్క నీరము ధరించిన శంకరుడు (గంగాధరుడు) వచ్చునేమో యాతని కీతడల్లుడే కదా యని వసంతుడు), మధువైరి శరధర యనగా ఈశ్వరనామమే యగును గావున మున్ను నన్ను కంటి మంటచే గాల్చిన శంకరుడు వచ్చునేమోయని మన్మథుడును, అతని పేరు దలచు మాత్రనే యనుటచే, ఆ శంకరుని పేరనగా హారమును (ఆదిశేషుని) తలపు చేసుకొన్న మాత్రముననే నన్ను భక్షించు శేషుని హారముగా గలగిన శంకరుడు వచ్చిన నాకు హాని గల్గునని వాయుదేవుడును మిక్కిలి భయముతో మరలిపోవుట నిజమని తాత్పర్యము.

కేశవ : గురువర్యా! మీ(త్ర్యర్ధి కావ్యంలో ఎక్కడైన హాస్యరసాన్ని పోషించిన సన్నివేశమున్నదా!

కాశీపతి : లేకేమి? సారంగధరీయ తృతీయాశ్వాసమునందు నొకచోట చెలికత్తియలు తమ దేవితో నన్యోన్యానురాగముల భాషింపుకొనుచున్న సన్నివేశంలో ఈ పద్యములు గలవు - ఆలింపుడు.

క॥ చెలి యొకతె వేరొకతెకుఁ
బొలఁతీ జంటయగు లికుచములు గోయుమనాన్
లలిదేవి నిక్కమిది యు
గ్మలి కుచములు గోయుమని పకాపక నగియెన్॥

యుగ్మ=రెండునగు, లికుచములు = నిమ్మపండ్లను (గోయుమని) మరియు ఉగ్మలి=ఆచేడియయొక్క, కుచములు= స్తనములను (గోయుమటంచు), ఇట్లు నొక భావమున్నందున ఆ దేవి ఈ భావగర్భితమైన వాక్యమును పల్కి పకాపక నవ్వెనని తాత్పర్యము,

గీ॥ దేవి కొలకయి యీ పండుఁ దెంచి దాచి
పెట్టితి నొసంగ నా యొడి ముట్టుకోక
పదరె యన విని యాపె కీపట్ల ముట్టు
కోక యట రారెయని దేవి జోక నగియె॥

(భావము సుగమము)

గీ॥ ఇంతియొక్కతె పేనుండె నేమొ నెత్తి
జిల గలిగెఁ జూడుమని యొక చేడె నడుగఁ
గొమ్మనీపేను నేనిసీ కుక్క ననిన
కుక్కవా యని దేవి పక్కునను నగియె॥

(భావము సుగమము)

## అవధానములు - సమస్యలు

కేశవా : అవధాన ప్రవీణా! మీరు విజయనగర, పిఠాపుర, జటప్రోలు మున్నగు ననేక సంస్థానాలలో శతావధాన, అష్టావధాన, నేత్రావధానాలెన్నియోచేసి పృచ్ఛకుల దత్తపదాది సమస్యల నాశువుగా పూరించి యనేక సన్మానములంది పండితులను పామరులను ఆకర్షించి నారని ప్రసిద్ధి. వాటిలో మచ్చునకు కొన్నిటిని వినిపించి ఆనందింప జేయ ప్రార్థన గురుదేవా!

కాశీప : అలాగే వాయనా రసప్రియా! విజయనగరములో నొకప్పుడు నేను అవధానము జరుపుచుండ వ్యాకరణ పండితులగు పజ్జల చిన సీతారామ శాస్త్రుల వారిచ్చిన సమస్య ఇది.

"ప్రాగ్దక్షిణ భాగములను భానుఁడు గ్రుంకెన్",

పూరణము —

కం॥ "వాగ్దయితు సాక్షిగా స
మ్యగ్దేవి రావె పిడుగు మనపైఁ బడునాన్
దిగ్దంతు లదర మెఱసెను
ప్రాగ్దక్షిణ భాగములను, భానుడు గ్రుఁకెన్".

పెద్దాపురములో "రాముడు పెండ్లాఁడె శైలరాజకుమారిన్" అను సమస్యనిట్లు పూరించితిని.

కం॥ "భీముడు సమధిక సుగుణ
స్తోముడు మౌళి ధృతబాల సోముడు క్ష్మాభృ
ద్దాముడు శంభుడు, మదన వి
రాముడు పెండ్లాడె శైలరాజ కుమారిన్"

మరొకచో నవధాన సభలో క్రింద వివరించిన పద్యమందలి పాదాదులందుగల రెండక్షరాల వాక్యములను నాల్గింటిలో రెండు బూతులునిడి భాగవతార్థము వచ్చునట్లుగా కందముఁ జెప్పుమనగా చెప్పినదీ పద్యము.

క॥ "రంగుగనుఁ గేశవుడు ద్వీ
ఓం గురుతరమునను బోలు పెను మడుగున మో
డెం గుమతి యైన మకరిని
వంగుచు వినుతించు దంతి వల్లభునేలన్॥"

ఒకప్పుడు మునగాల సంస్థానములో "గౌరికి కేశవుండు పతిగావలె శంకరుడన్న కావలెన్" అను సమస్యనిచ్చారు. ఆ సమస్య నిట్లు పూరింపనైనది.

ఉ॥ వారణవైరి యే సతికి వాహనమౌ, సిరికిన్ విభుండెవం,
డారయ వాణికిన్ జలరుహాసను డేమియుగావలెన్, ఫణిన్
హారముగా నెవండు గొనె, నాహలి కృష్ణున కేమిగావలెన్
గౌరికిఁ గేశవుండు పతిగావలె శంకరు డన్నగావలెన్॥

## -: దత్త పదములు :-

అవధాన ప్రక్రియ యందు పృచ్ఛకులు తమకు అందిన పదములను అనగా సంబంధములేని పదములిచ్చి పూరింపుమని చెప్పెడి పదము "దత్తపది" అని వ్యవహరింతురు, ఉదాహరణముగా నీ క్రింది పదములు గమనింపుడు.

ఆత్మకూరు సంస్థాన సభలో నిచ్చిన (దత్తపది) సమస్యనుగా ంచుడు. "రోహిణి-ఉత్తర-రేవతి - హస్త" వీనిని పాదమున కొకటిగా గీతమున చెప్పుమన్నారు, ఆ పదముల పూరణము వినుము.

గీ॥ "రోహిణీ ధవ సన్నిభ రూపుడైన
ఉత్తరా వల్లభుని తన యూరువుపయి
రేవతీ విభు డిడుకొని ప్రేమ మీర
హస్త మస్తక సంయోగ మాచరించె"

ఇట్టిదే మరొకటి వినుము రసప్రియా!

కడవ - కుండ - మూకుడు - మంగలము ఈ పదములను భారతార్థము వచ్చునట్లు ఆటవెలదిలో చెప్పుమనగా చెప్పిన పద్యమును చూడుడు ఈ దత్త

పదాలు నాగర్‌కర్నూల్‌లో శ్రీ వి.యస్. గౌడుగారి యింట అవధానము జరిపించి శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు యిచ్చిరి,

ఆ॥వె॥ "కడవ చూలి యొద్ద గఱచిన విలువిద్దె
బలిమి జూపి తౌర కలఁగ కుండ
ఎఱుకు నైతి నేను నేదాయె మూకుడు
క్షమను నీకు మంగలము కిరీటి॥" అని పూరించినాను.

ఒక సారి గద్వాలలో జరిగిన అష్టావధానంలో గాడేపల్లి వీరరాఘవశాస్త్రి గారు ఇచ్చిన సమస్య "విడియము పుక్కిటన్ జొనిపి వేడెసుతల్లిని కంతుకేళికై" దానినిట్లు పూరించితిని.

చ॥ కడు విరహంబు తోడ విటకాఁడొక రుండొక వేశ్యయింటకిన్
వడిజని జవ్వనిన్గని కృపన్ దమిదీర్చు మటంచుఁ వేడ ని
య్యెడ వెలి యైతి నా జనని నింపుగ గూడు మటంచుఁ జేర్పగాఁ
విడియము పుక్కిటన్ జొనిపి వేడెసు తల్లిని కంతు కేళికై॥

ఇది వనపర్తి సంస్థానంలో ఇచ్చిన సమస్య. కళావరు, డైమను, అడదను ఇసిపేటు-వీటిని పాదమునకొక శబ్దమును జేర్చి భారతార్థము వచ్చునట్లు చంపకమును చెప్పుమన్నారు దానినిట్లు పూరించితిని.

చ॥ లలితముఖప్రదీప్తిని కళావరు బోలిన కుఱ్ఱవాడు ని
ర్మల తర రూపసంపదను మన్మథుఁ డైమను పార్థసూతి ప్రో
జ్వలముగ యుద్ధమాడదను జద్విషుఁ డర్జునుఁ డందులేమి చే
పెలుచన గూలిపోయె నిసిపేటు గుబెల్లనగూలు కైవడిన్॥

గోపాలపేటలో భీష్మ, ద్రోణ, కృప, శల్య ఈ నాలుగు శబ్దములొక్కొక్కటొక్కొక్క పాదమున నిమిడ్చి రామాయణార్థము వచ్చునట్లుగా పూరించమన్నారు. నా పూరణమాలించుడు.

గీ॥ "మారుతి భీష్మముగను లక్ష్మణుఁడు మూర్ఛ
హొందెనిఁక ద్రోణ గిరికేగి తొందరగను
కృప దలిర్పగ సంజీవి నెసఁగ దెచ్చి
యిడగదే నీదు కౌశల్య మిపుడుజూతు॥"

కేశవా : మహాకవిశేఖరా! మీ సారంగధరీయము గ్రంథాంతంలో కొన్ని పద్యాలు ఎవరో అధిక్షేపిస్తే చెప్పినట్లు ఉన్నవి-వాటిని ముందుగా వేయక చిట్టచివరి పేజీల్లో ఎందుకు వేశారు. తెలుసుకోవాలని ఉంది-దయచేసి వివరిస్తారా!

కాశీపతి : అలాగే వివరిస్తాను - వినండి - నా సారంగధరీయ ముద్రణ పూర్తి కావచ్చిన సమయమది - అప్పుడు పిఠాపురం రాజావారు తమ పండితులచే సూర్యరాయ నైఘంటికము వ్రాయిస్తున్నారు - వారు గద్వాల రాజావారికి లేఖ వ్రాస్తూ మీ సంస్థాన విద్వద్గద్వాలగా కీర్తి గడించినది -మీ వద్ద మీ పండితులు వ్రాసిన గ్రంథాలేవైన ఉంటే పంపండి-మేము నిఘంటువు వ్రాయిస్తున్నాము-ఉపయోగించు కుంటాము - అని అర్థించారు - అప్పుడు ముద్రణ పూర్తికావచ్చిన సారంగధరీయం ఒక్కొక్క ముద్రిత కాయితాలను పేజీలవారిగా ఏరి కూర్చి ఒక పుస్తకంగా తయారుచేసి పంపారు - పిఠాపురం రాజా వారు అది చూచి ఈ కాలంలో గూడ త్ర్యర్థి కావ్యం వ్రాసేవారున్నారా! అట్టి కవి మీ సంస్థానంలో ఉండటం మీకు గర్వకారణం అంటూ తమ ఆశ్చర్యాన్ని ఆనందాన్ని వెల్లడిస్తూ ఒకటే పుస్తకం పంపారేమిటి ధర కావాలంటే ఇస్తాము 12 పుస్తకాలు పంపక పోయారా అని వ్రాశారు తమ లేఖలో. ఆ లేఖకు రాణీగారు ఎంత సంతోషపడ్డారు - అప్పటికి రాజావారు లేరు - రాణిగారు సారం.. ధరీయ కావ్యాన్ని తమ భర్తయగు రాజావారికి అంకితమిస్తున్నారు.. కొందరు దుర్మార్గులు ఓర్వలేక నా కావ్యముద్రణతో నాకు ఎక్కు సంభావన రాగలదని నాకు గౌరవం పెరుగుతుంది అని ఓర్వలే

రాణీగారితో చెడుసలహాలు చెప్పారు, రాణీగారు నన్ను పిలిపించి, ఏమండి కవిగారూ! మీ కావ్యం జనోపయోగం కాదట. ఎవరికీ అర్థం కాదట కదా! మరి చాల ఖర్చుపెట్టించారు. అని అడిగారు. అప్పుడు నాకేమీతోచక గిర గిర గిర కళ్లలో నీళ్లు తిరిగాయండీ దుర్మార్గులెంతపనిచేశారు అని అప్పుడు ఆశువుగా చెప్పినపద్యాలేఅవి

కేశవా : ఆ పద్యాలు మీ ముఖతః ఇప్పుడు వినాలని కుతూహలంగా ఉంది. దయచేసి వినిపిస్తారా! గురువర్యా!

కాశీపతి : అలాగే. అవధరింపుము రసప్రియా! ముందు నేను కావ్యం ఎందుకు వ్రాశానో సీస పద్యంలో చెప్పాను.

సీ॥ ననుసాకినట్లు మాతను పితన్ సాకనా
కవకాశము లభించనట్టి ఋణము
సాంబమూర్తి వరప్రసాదంబుఁగొని తన
ననిశమున్ ధ్యానింప నట్టి ఋణము
విశ్వకర్మాన్వయా విఖ్యాతినై కుల
వ్యాపారములుచేయ నట్టి ఋణముఁ
దావకాస్థాన విద్వత్కవినై భవ
దర్థంబనుభవించునట్టి ఋణముఁ

గీ॥ దీర్చుకొనుటకుఁ గాశీపతియను నేనుఁ
దల్లిదండ్రులఁ వేర్కొని దర్పకారి
కథను శిల్ప చమత్కృతి గలుగఁ గూర్చి
తమకుఁ గృతి నిచ్చినాడ గద్వాలతోడ!

ఇక "మీ కావ్యం అర్థంకాదు లాభమేమి" అన్నందుకు

చ॥ అమరఁగఁ బెక్కుమందిగని యర్థము గాదను నీదుత్ర్యర్థికా
వ్యముగల లాభమేమియని యిల్పులు పల్కుదు రగ్రజాతి వ
జ్రమును దరిద్రులెల్లఁ గొనఁ జాలరు రే తమబోటి సార్వభౌ
మమణులుఁ దానిఁ గైకొనరె మత్కృతినట్లె బుధుల్ గ్రహింపరే!

రాణీ గారు కీర్తిశేషులైన తమ భర్తగారికి ఈ కావ్యం ఇప్పిస్తున్నారు కనుక, 'నా సారంగధరీయం పూర్తిచేసి సమర్పించితిని దీనిని గైకొనుము సీతా రామ భూపాలకా!' అంటూ —

మ॥ అతి చిత్రంబుల కాటపట్టన మహాత్ర్యర్థి ప్రబంధంబనన్
బ్రతి పద్యంబు రసాస్పదంబగుననన్ భాసిల్లుచున్నట్టి మ
త్కృత సారంగధరీయమున్ గొనుము పూర్తిన్ జేసి యర్పించితిన్
దత గద్వాల పురీశ ముష్టిపలి సీతారామ భూపాలకా!!

"సీతారామ భూపాలకా!"అని ఆలాపిస్తుండగా నా కళ్లంట బొట బొట బొట నీళ్లు కారినయి. రాణీగారు ఇదంతా దుర్మార్గుల కుచేష్టలని గ్రహించారు. 'కవి గారూ! బాధ పడకండి. మీ కావ్యం గొప్పది వెలువడక ముందే పిఠాపురం రాజా వారంతటి వారిచే ప్రశంసలనందుకొన్నది. మేము చాడీలు నమ్మము' అని అన్నారు.

## బంధ గర్భ కవితా విశేషము

కేశవ : చతుర్విధ కవితా విశారదా! చిత్ర, ఆశు, బంధ, గర్భ కవిత లనిన మీకు నల్లేరుపై నడక వంటివి కదా! మీ రచనలలో నట్టి వొకటి రెండు పద్యములను చవిచూడవలెనని కోరిక కలదు గురుదేవా!

కాశీప : సరే రసప్రియా! నా త్ర్యర్థికావ్యము నుండి "కంద గీత మత్తేభ గర్భిత సీసము"ను వినిపించెద వినుము.

## కంద గీత మత్తేభ గర్భిత సీసము

సీ॥ వితత శుంభద్యశ విశ్వపాలన రతా
దాక్షాయణీ వల్లభాక్షతారి
విజిత మీనధ్వజ వీరభద్ర జనకా
శ్రీమ ద్దరిన్నాయకా మహాత్మ
విగత మృత్యూ శివ వి_స్తృతాత్మ విభవా
కైవల్య సంధాయకా కృపాబ్ధి
వినుత చారిత్ర కృపీటయోని నయనా
నూత్న ప్రభాభృత్తనూ కపర్ది

గీ॥ గిరి సదన ప్రమద గణవర పరమ పురుష
భుజగభూష పశుపతి శంభూ దరకర
మహిత సహిత శంకర సురమాన్య వరద
శితి గళ శశిమౌళి నమస్కృతులు నీకు॥

ఈ పద్యము నందు పెద్ద చరణములు నాల్గింటిలో మొదట నొక యక్షర మును, చివర మూడక్షరములును వదలి చదివినచో మత్తేభ విక్రీడిత వృత్త మగుననియు, గీతములో చతుర్థ పాదాంతము 'నమస్కృతులు నీకు' అను వాక్యము వదలి చదివినచో కంద పద్యమగుననియు గ్రహించునది.

## గర్భ మత్తేభము

మ॥ తత శుంభద్యశ విశ్వపాలన రతా దాక్షాయణీవల్లభా
జిత మీనధ్వజ వీరభద్ర జనకా శ్రీమద్ధరిన్నాయకా
గత మృత్యూ శివ వి_స్తృతాత్మ విభవా కైవల్య సంధాయకా
నుత చారిత్ర కృపీట యోని నయనా నూత్నప్రభా భృత్తమా॥

## గర్భ కందము

క॥ గిరి సదన ప్రమథ గణ వర
పరమ పురుష భుజగ భూష పశుపతి శంభూ
దర కర మహిత సహిత శం
కర సురమాన్య వరద శితిగళ శశిమౌళీ॥

## కంద ద్వయ గర్భిత చంపక నాగబంధము

ఇక ఆ గ్రంథము నుండియే బంధ గర్భితముగా వ్రాసిన నాగబంధ చంపకమును తిలకింపుడు. ఇది ఆ బంధపటమును చూచుచు చదివిననే కాని బోధపడదు.



ఈ పద్యమందలి చంపక వృత్తమును "వలపలి వడిగ" మొదలుకొని "డాపలి వడిగ" వరకు మెలికల వెంబడి క్రమము దప్పక చదివినచో నీ క్రింది పద్యమేర్పడును. ఈ పద్యమున రెండు కందములు గలవు.

చ॥ పరశివదా యపార విభవా, భవవర్ధన ధీవరా విభా
సురజనపాల మారమదసూదన క్రమ యమీన దేవతా
పరి భవదా విషారధర భా రవి నిర్మల భావ శంకరా
చిర వినయా నగారి నుత చేతన విష్ణు విధీన మానితా॥

## గర్భస్థ ప్రథమ కందము

క॥ శివదా యపార విభవా
భవ వర్ధన ధీవరా విభాసుర జన పా
భవదా విషారధర భా
రవి నిర్మల భావ శంకరా చిర వినయా॥

## గర్భస్థ ద్వితీయ కందము

క॥ జనపాల మారమద సూ
దన క్రమ యమీన దేవతా పరిభవదా
వినయా నగారి నుత చే
తన విష్ణు విధీన మానితా పరశివదా॥

నాగబంధము నందలి చంపకమున కర్థ వివరణమిది. పర = ఉత్కృష్టమైన, శివ = మంగళములను, దా = ఇచ్చువాడా! లేక పర = శత్రువులయొక్క, శివ = శుభములను, దా = ఛేదించువాడా! అపార = మేరలేని, విభవా = వైభవములు గలవాడా!, భవ వర్ధన = సంసారమును ఛేదించువాడా లేక వృద్ధి బొందించువాడా! ధీవరా = శ్రేష్ఠమైన బుద్ధి గలవాడా! విభా = మిక్కిలి ప్రకాశించునట్టి, సురజనపాల = దేవతలను పాలించువాడా! మార = మన్మథుని యొక్క, మద =

గర్వమును, సూదన = నాశనము చేసినవాడా! క్రమ = ఇంపైన, యమీన = (యమి + ఇన) = మునీశ్వరుల యొక్కయు, దేవతా = దేవతల యొక్కయు, పరిభవ = అవమానమును, దా = ఛేదించు వాడా! విషార = సర్పమును, ధర = తాల్చిన వాడా! బా = కాంతి యందు, రవి = సూర్యుడవైన వాడా! నిర్మల = కల్మష రహితమైన, భావ = హృదయము గలవాడా!, శంకరా = శుభకరుడవైన వాడా! చిర = పూర్వము నుండియు, వినయా = మిక్కిలి నీతి గలవాడా! నగ = పర్వతములకు, అరి = శత్రువైన ఇంద్రునిచేత, నుత = కొనియాడబడిన, చేతన = తెలివి గల వాడా! లేక ప్రాణి గలవాడా!, విష్ణు = నారాయణుని చేతను, విధి = బ్రహ్మచేతను ఇన = సూర్యునిచేతను, మానితా = గౌరవింపబడెడు వాడా! యని శివుని వర్ణన మిందు కలదు.

ని : దః పుంసిదా తరిచ్ఛేదే; అని రత్నమాల, వర్ధనం ఛేదనే వృద్ధౌ అని విశ్వము.

## ప్రశ్నోత్తర కవితా చిత్రము

కాశీపతి : రసప్రియా! ఇంతవరకు మీరు నన్ను ప్రశ్నించటం, నేను సమాధానాలు చెప్పటం జరిగింది. ఇప్పుడు నేను మిమ్ముల ప్రశ్నిస్తాను మీరు సమాధానాలు చెప్పవలయును. నా తట్టు ప్రశ్న పద్యము నకు మూడేసి అక్షరములలో మీరు సమాధానము చెప్పండి.

కేశవాచారి : గురువర్యా! ప్రయత్నిస్తాను. ఒకవేళ శిష్యుడికి తెలియనిది గురుడే చెప్పటం ధర్మము కదా గురుదేవా! ఆ ప్రశ్న ఏదో సెలవిండు.

కాశీపతి : సీ॥ కడను గీతంబును బడయు పద్యంబేది? (సీసము)
వరుణ పాలితమైన వైపదెట్టి? (ప్రతీచి)
మునివరుల్ గుహలయందున నొనర్చెద రెట్టి? (తపము)
సర్వమున్ భరియింపఁ జాలునెట్టి? (ధరణి)
కూర్మంబునకు తెలుంగున గల పేరెట్టి? (తామేలు)
వరకల్కి మూర్తికి వాహమెట్టి? (అశ్వము)
తలిదండ్రులకు నందనులపైన గలదెట్టి? (కరుణ)
అంగజుండెక్కు తురంగమెట్టి? (చిలుక)

గీ॥ అన్నిటికిఁ జూడ మూడేసి యక్షరములు
పొడుము ప్రత్యుత్తరములలో నడిమి లిపుల
పేరులు గలారు మిమ్ము ననారతమ్ము
సాకుదురు గాత కేశవాచార్య వర్య॥

బ్రాకెట్లలో గల మూడక్షరాల పదములు సమాధానాలు
(సతీ పరమేశ్వరులు)

గతజేము

విభజనము - తీర్పు

సీ॥ ఒక యూర ముగ్గురు సోదరు లుండిరి
తొమ్మిది వారికి గుమ్ములుండె
పుట్టి గుమ్మియు రెండు పుట్ల గుమ్మియు మూడు
పుట్ల గుమ్మియు నాల్గు పుట్ల గుమ్మి
ఆలాగె హెచ్చుచు నైదు గుమ్ములు గూడ
నెళవున వడ్లతో నిండి యుండె
సోదరుల్ ముువ్వురా గాదెలు మూడేసి
పంచుకో వలెనట, వడ్లు దీసి

గీ॥ సర్ద రాదట పాలికి శాలిధాన్య
మెన్నివచ్చును గాదె లేదేది వచ్చె
చక్కగా మది యోచించి లెక్కచేసి
తెల్పగదె కేశవాచార్య ధీరవర్య॥

**కేశవాచారి :** గుమ్ముల యుక్తము ధాన్య విభజన తీర్పు ఇట్లు కలదు.
మొత్తము (9) గుమ్ములలో—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5 పుట్లు గలవి | 3 గుమ్ములు | – | 15 | పుట్ల ధాన్యము | |
| 4 ,, ,, | 1 గుమ్మి | – | 4 | ,, | ,, |
| 3 ,, ,, | 2 గుమ్ములు | – | 6 | ,, | ,, |
| 2 ,, ,, | 2 గుమ్ములు | – | 4 | ,, | ,, |
| 1 ,, ,, | 1 గుమ్మి | – | 1 | ,, | ,, |
| మొత్తం | 9 గుమ్ములు | | 30 | పుట్ల ధాన్యము | |

అగ్రజ, మధ్యమ, కనిష్ఠుడు నను ముగ్గురు సోదరులకీ క్రింది విధముగా ధాన్య యుక్త గాదెలు పంచవచ్చును.

| | అగ్రజునకు | మధ్యమునకు | కనిష్ఠునకు |
|---|---|---|---|
| | 1 గుమ్మి 5 పుట్లు గలది | 1 గుమ్మి 5 పుట్లది | 1 గుమ్మి 5 పుట్లది |
| | 1 ,, 3 ,, | 1 ,, 4 ,, | 1 ,, 2 ,, |
| | 1 ,, 2 ,, | 1 ,, 1 ,, | 1 ,, 3 ,, |
| మొత్తం ఒకొ్కక్కనికి | 3 గుమ్ములు 10 పుట్ల వడ్లు | 3 గు॥ 10 పు॥ వడ్లు | 3 గు॥ 10 పు॥ వడ్లు |

అని లెక్క తీర్పు చేసి సమాధానమీయ గల్గితిని గురుదేవ.

కాశీపతి : కేశవాచార్యా! నిరోష్ఠ్య పదబంధమైన మీ "అర్ధగణాంక శాఖ" పై ఒక నిరోష్ఠ్య పద్యము శృంగార రసభావ చమత్కృతిగా వినిపించుడు.

కేశవ : మనవి చేస్తాను గురువర్యా! ఆలకింపుడు.

గీ॥ సార్ధ కార్ధ గణాంక శాస్త్రాలను ఘన
జఘనకుచయుగళిని గాంచ చాల నెగడె
ఈగాన నెద్దడి యనియెడి కొను జడిసి
సన్నగిలె తెన్గునాడను చాన కహహ!

(అర్ధ గణాంకశాఖను బలపరిచి విస్తరింపజేసినచో రాష్ట్రంలో దుర్భిక్షము నశించి సుభిక్షమేర్పడునని **తాత్పర్యము**)

కేవవా : చిత్ర కవి సార్వభౌమా! మీరు వర్ణ సమామ్నాయములోని క, చ. ట, త, ప వర్గముల నంటకుండ 'క' కారాద్యక్షరము గల "కృష్ణ" లీలలను శౌరి శైశవలీలగా వ్రాపినారు, కాని 'క' కారాద్యమగు మీ పేరును అందు ఎట్లు వ్రాసితిరో విన కుతూహలము కల్గుచున్నది. ఈనా తుది సందేహము తీర్చ మనవి.

**కాశీపతి** : రసప్రియా! వినుము, ఏ గ్రంథముననేని కవి తన నామమును ఉపోద్ఘాతముననేని లేదా పీఠికనందేని లేక అశ్వాసాంత గద్యముననేని తెలుపుట మీరెరిగిన విషయమే. అపంచ నర్గీయమగు నా 'శౌరి శైశవ లీల'లో అశ్వాసాంత గద్యస్థానమున "ఫలశ్రుతి" యను పేరుననొక పద్యమున నా నామమును యెట్లు వ్రాసితినో **వి**నిన **న**ందలి చమత్కృతి మీ సందేహమును తీర్చును. ఆ పద్యమిది;

సీ॥ "హాసలరు పరాస్యహల్లు వాలు వహిల్ల
వ్రాసి సౌరార శీవ్రాసి యివల
యరలలో ర వ్రాయి వావలి యాఅవ
వ్రాయి వెలయ లీల వ్రాసివేసి
లలివ్రాయి యీవల ల వ్రాయిలో వల
సుళ్లీ రెలసి విలసిల్ల వ్రాసి
వాహ్వారె యారయ స్వాహ్వాయౌ సూరి యీ
శౌరి శైశవ లీల సరళశైలి

నసి సవరిల వ్రాసె"..................

నని నా పేరు వచ్చునట్లు వ్రాసినాను.

టీ : హొసలరు = అందమొప్పు, వర = శ్రేష్ఠమైన, అన్యహల్లున్ = ముఖ్యహల్లు యైన (అనగా "క" వర్ణమును), వాలుపహిల్ల వ్రాసి = దీర్ఘముగా వ్రాసి (అనగా "కా" వ్రాసి), సౌరారన్ = సొంపారగా, శీ వ్రాసి = శీ యను నక్షరము వ్రాసి, (తర్వాత) య ర ల లో = య ర ల లో గల, ర వ్రాయి = ర అక్షరమునకు, ఆవలి = పై వైపునగల, ఆఱవ వ్రాయిన్ = ఆఱవ అక్షరమును, (అనగా ర అక్షరమునకు పైవైపునగల 'ప'యను నక్షరమును), వెలయు లీల వ్రాసివేసి = ప్రకాశించునట్లు వ్రాసి, లలి వ్రాయి యీవలన్ = ఆ అక్షరమునకు ఈవల అనగా 'ప' అక్షర మున కీవలి వైపున, ల వ్రాయిలోన్ = ల యను నక్షరములోపల, వలస్ = కుడివైపున, సుళ్లీరెలసి = (సుళ్లు + ఈరు + ఎలసి) రెండు సుళ్లు అనగా వర్తువులుగా వ్రాసి (అనగా "ల" లో మొదటి సుడి "లి"— మరియు రెండవ సుడి "తి" గా వ్రాసి, ఆరయన్ = చూడగా, వాహ్వారె = చిత్రముగా, స్వాహ్వయౌసూరి = తన నామముగల విద్వాంసుడు (అనగా కాశీపతి విద్వాంసుడు), నసిన్ = బాగుగా, నవరిల వ్రాసె = ప్రకాశించునట్లు వ్రాసెను–రచించెను, అని నా నామమును వివరించినాను.

కేశవాచార్యా! ఇట్లు ఆ మూలాగ్రము చమత్కార రచనతో నిండిన ఈ "చమత్కృతి"ని

ఆ॥వె॥ ఉద్గమించి హర్ష మున్నతమ్మయి బరగు
క్రీస్తు 'సమ' న నీకు కృతి యొనర్చి
ఆదిపాద మరయ నగు చమత్కృతి చూడ
కేశవార్య యిడితి క్షేమమొదవ॥

టీ : ఉద్గమించి = పైకి ఉబికి, హర్షము = సంతోషము, ఉన్నతమ్మయి = అధికాధికమై, పరగు = ఒప్పు, క్రీస్తుసమన = క్రీస్తు సంవత్సరమున, (అనగా నేది యన) ఆదిపాదమరయన్ = మొదటి పాదమును చూడగాన్,

అగు=అయ్యెడి, చమత్కృతి చూడన్=చూడగా చమత్కారమగును (అట్టి సంవత్సరమని భావము), కృతి యొనర్చి=కావ్యము రచించి, కేశవార్య=కేశవాచార్య, నీకు=మీకు, క్షేమమొదవ = క్షేమము కల్గుగాతయని, ఇడితి=ఇచ్చితిని, సంవత్సరమునుగూర్చి ఈ పద్యమందలి తొలిపాదము నిట్లు గ్రహింపవలయును.

"ఉద్గమించి" యందలి గకార చిహ్నమగునది తెలుగున (౧) = ఒకటి
"హర్షము" నందలి వలపల గిలక, తెలుగున (౯) తొమ్మిది.
"ఉన్న" మాటలోని నకార ద్విత్వ చిహ్నము (౭) ఏడు.
"తమ్మ"లోని మకార ద్విత్వ చిహ్నము తెలుగున (౪) నాలుగు.

పరగునట్టి సంవత్సరమని చమత్కారముగా (౧౯౭౪)=1974) క్రీ. శ. మును తెలుపనైనది.

ఓం

శుభం భూయత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





"చమత్కృతి" స్వీకరణ సందర్భములో 1971

కృతిపతి దంపతులు

శ్రీ పోతేదార్ కేశవాచార్యులు — శ్రీమతి కనకమ్మ

# గురుప్రాణి

రసప్రియ శేషాచార్య

<u>గురుదేవుల సన్మాన సభలలో చదివినవి</u>

సీ॥ విద్వత్కవీంద్రులు వినుతింపఁ ద్ర్యర్థికా
వ్యము వ్రాసినట్టి నీ పటిమ పటిమ
అపురూపముగ పదియక్కరంబులతోడ
కబ్బ మల్లిన నీదు గరిమ గరిమ
అచ్చ తెన్గున నిరోష్ఠ్య ప్రబంధంబును
కృతిగూర్చినట్టి నీ ప్రతిభ ప్రతిభ
పద్యంబు నొకటి ముప్పదియర్ధములతో నె
సంగ వ్రాసిన నీదు శక్తి శక్తి

గీ॥ సిద్ధయోగి చరిత్ర నృసింహ నిరస
న స్తుతి ప్రముఖముల జనంబు లెంచు
పగిది రచియించినట్టి నీ ప్రజ్ఞ ప్రజ్ఞ
సుకవితారంహ! కాశీపతి కవిసింహ!

సీ॥ కావించుకొంటివి కనకాభిషేకంబు
హనుమ త్ప్రభునిచేత హాలహర్వి
పట్టించుకొంటివి బ్రహ్మరథమ్మును
శిల్పిబ్రాహ్మణులచే సిద్ధిపేట
వేయించుకొంటివి విప్రులచే ఘంటి
కా కంకణాల్ వినకండ్లకుంట
తొడిగించుకొంటివి తోడాను కాలికి
పురజనాగ్రణులచే ప్రొద్దుటూర

గీ॥ నేస్గుపైవారివలన నూరేగినావు
మకరకుండలకేయూరమంజుపతక
ములనెనసినట్టి నిన్నెన్నవలవియగునె!
దివ్యతరసౌఖ్య! కాశీపతి గురుముఖ్య!

సీ॥ పెదవి విప్పినచాలు కదలించు హృదయాలు
పదపదంబందు నీ భావపటిమ
కంఠమెత్తినచాలు గంగయై పొంగారు
ఔరాయనంగ నీ అశుధార
పలుకరించిన చాలు పులకలెత్తించును
కులుకులొల్కించు నీ తెలుగు కవిత
చెలిమి చేసినచాలు కలిమి బలిమి గూర్చు
పరియించినంత నీ ప్రౌఢరచన

గీ॥ అద్భుతము గొల్పు నీ త్రివిధావధాన
వాణియును చిత్రకవితలు వర్ణనములు
ఇంతయేయని పొగడ నేనెంతవాడ!
దివ్యగుణసాంద్ర! కాశీపతికవిచంద్ర!

మ॥ కవులెల్లన్ వినుతింపుకై వడి మహోద్గ్రంథంబులన్ వ్రాసి, అ
త్యవ లీలన్ త్రివిధావధానములఁ జేయంజాలి. అత్యంత గౌ
రవ సన్మానములంది, పెక్కు బిరుదుల్ రమ్యక్రియన్ బొంది తా
భువి నీ శక్తిగణింప శక్యమగునే! పోకూరి కాశీపతీ!

మ॥ అవురా! కావ్యము వ్రాయుటే ఘనమికన్ త్వ్యర్థి ప్రబంధంబు సం
స్తవనీక్రియ పండితుల్ కవులు సంశ్లాఘింప నేరీతిగా
నవభావైక రసాస్పదంబగు గతిన్ గల్పించితౌ బాపురే!
భువి నీకావ్యపటుత్వమెన్నవశమే! పోకూరి కాశీపతీ!

చం॥ కపనము పుట్టినప్పటి లగాయతు నేటికి లేనియట్టి స
త్కవిత దశాక్షరీయముగ గ్రంథము వ్రాసిన దిట్టవీవు సం
స్తవమొనరింపగాదగిన త్ర్యర్థి యనందగు కావ్యకర్తవై
తివి కవిసింహ! నిన్ను వినుతింపగ శక్యమె మమ్ము బోంట్లకున్।

ఉ॥ ఉబ్బసమైన వాగ్ఝరి మహోజ్జ్వలమై ప్రవహించు అబ్దముల్
డెబ్బది దాటిపోయిన పతింతువు కళ్ళకు జోడులేక, మేల్
కబ్బములల్లుటందు మనగాడవయా కవితా ధురీణ! మే
మబ్బురమొందకుందుమె మహాకవిశేఖర! కాశికాపతీ!

గీ॥ లక్ష్మిలోబడె నీదువాగ్లక్ష్మి కహహ!
కానిచో కనకాభిషేకముగ మారి
పిదప కాల్బట్టునే గండపెండరమయి
అత్తకోడలికే లొంగనాయె నిచట!

గీ॥ సరసులను వంచజూచు చంచలుల భంగి
అబ్బినను జుట్టు నబ్బనియపుడు కాళ్ళ
బట్టెదరటన్న సామ్యమీపట్ల నిక్క
ముగను గనుపించె కాశీపతి గురువర్య!

కం॥ ఆ రోజుల రాజులచే
నీరాజనమందినావు నేర్పరివై, నీ
వీరోజుల సన్మాన మ
హో! ♦ రాధాకృష్ణచేత నొందితివికదా!

గురుదేవుల అస్తమయ వార్త విని —

ఆ॥ భువిని పూజలెన్ని పొందిన నీకింత
తృప్తిగల్గకుంట దివికినేగి
అచట గౌరవముల నందితివేమేమి?
తెల్పవైతి నాకు దివ్యచరిత!

---

♦ రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు

కం॥ లోకముల నెవటికేగిన
నాకు నెరింగించుమంటి నాపై ప్రేమన్
నాకింత దెల్పకుండగ
నాకమునకు నేగినావ నా గురుదేవా!

కం॥ మా తాతకు జతగాడవు
నీతో చనవుంట "నీవు నీవ"ని నీతో
రీతిని విడి మాట్లాడితి
నా తప్పు క్షమించినావ నా గురుదేవా!

కం॥ గురుడవు సఖుడవు కవితా
గురుడవు తాత్విక విచార ఘోరాటవిలో
దరిజూపు ప్రాజ్ఞుడవు మా
తర తర తర తర తరాల తాతవయారే!

ఆ॥ నేను మెత్త బడితి నీ కొసంగిన చమత్
కృతిని అచ్చువేసి అతులకీర్తి
అందుకొనుము కేశవాచార్య శీఘ్రమే
యనుచు చెప్పి దివికి నరిగినావు!

చం॥ నను కవిపోషకుండనుచు నాపయి మక్కువనొల్కబోసి మ
న్ననగృతి నాకొసంగిన ఋణమ్మది తీరునె జన్మజన్మలన్
నిసు గురుపూజలన్ దనుపనేర్చినగాని మహాకవీంద్ర! వం
దనములు సేతు తావక పదంబులకేన్ మనసార భక్తితోన్!

శా॥ నా కూతుళ్ళ వివాహముల్ జరుపుయత్నంబందు దైవంబటుల్
నాకున్ జేసిన వాక్సహాయమది జన్మాంతాలకు న్ మర్పుకున్
రాకుండున్ మహితోపకార కృతధర్మా! స్వామి కాశీపతీ!
నేకై మోడ్చి కృతజ్ఞతాంజలిడితిన్ నీ పాదపద్మాలకున్!

కం॥ కేశవుడనేను స్వామీ!
కాశీపతి గురువరేణ్య! కడసారిగ సం
దేశము శోకించగనిడి
ఈశుని కడకేగ నీకదెటు మనసొప్పెన్!

కం॥ కవితా చిత్రములెన్నియొ
వివిధ కళారుచుల వెన్నొ వివరించిన ఓ
కవితానిధి! కాశీపతి!
నవరసపాదోధి! నీకు నతులర్పింతున్!

గురుదేవులకు "అమరస్మృతులు" కృతి నంకితమిడు సందర్భమున —

ఆ॥ కయితల గడుపారగన్న కాశీపతి
గురువరేణ్య! నీదు చరణములకు
అంజలి ఘటియించి "♦ అమరస్మృతులు" నీకు
నంకితముగ నిడితి నందుకొనవె!

ఆ॥ కవనభువనములకు కాశీపతి వటంచు
కృతి సమర్పణ మొనరించునపుడు
నీ పదాలుగడుగ నా పదాలనమృత
మొలక లేక కనుల జలములూరె!

చమత్కృతి స్వీకృతి

గీ॥ నాకు నీ 'చమత్కృతి' నిచ్చి నన్ను దిక్కు
లెక్కజేయు దాతా! నీదు ఋణభరమ్ము
చేత మూర్ధమ్ము వాల్చి తాశీర్వదించు
చిత్రకవి సార్వభౌమ కాశీపతీంద్ర!

♦ "అమరస్మృతులు" ఖండకృతి ఆంధ్రప్రదేశ్ అకాడమీవారి ఆర్థిక సహాయముతో 1978 ఆగష్టులో ముద్రింపబడినది.

# నివేదనం

— రసప్రియ

## కవిసింహ చిత్ర కవితా గ్రంథములు

విద్వద్గద్వాల అను పేరు గడించిన మాజీ గద్వాల రాజస్థాన కవులుగా శ్రీ పోకూరి కాశీపత్యవధానులు సుప్రసిద్ధులు. వారు చతుర్విధ కవితాధురీణులు. త్రివిధావధానపంచాననులు. నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్రహరిశ్చంద్రోపాఖ్యానము; నిష్కేవల స్వర నిర్బిందు నిష్పంచవర్గ నిర్గద్య దశాక్షరీయ "శౌరిశైశవలీల", త్ర్యర్థిప్రబంధమగు 'సారంగధరీయము' ఇత్యాది మహాకావ్య నిర్మాతలు. ఇంతేగాక "త్రింశదర్థ పద్యరత్నము" ను (30 అర్థాలతో ఒకే పద్యం) రచించినారు. ఇట్టి కావ్యములు జనసామాన్యమునకు ఏమి ప్రయోజనము అను ఒక వాదము లేకపోలేదు. అందుకు కవిగారే సమాధానమిచ్చినారు. "సర్వజనులకు అందుబాటగు కవిత్వమే కవిత్వముగాని కొలదిమందికి మాత్రమందుబాటులోనుండునది కవిత్వము కాదను పక్షమున మిక్కిలి విలువగల వజ్రము దొరికిన వ్యక్తి పలువురకు కొనరాని వజ్రము నాకెందుకనిపారవేయునా ?.... సరసులగు కవిపండితవరేణ్యుల పరమాశ్చర్యముల నొందింప దీనిని రచియింతి కానీ విరసుల కొరకు కాదని గ్రహింపవలయు...." నని కవిగారు "శౌరిశైశవలీల"లో తమ విజ్ఞాపనము నందు ప్రకటించియున్నారు. అయిననూ "నా రచనలగు త్ర్యర్థి కావ్యాది 60 గ్రంధములలో నాలుగు గ్రంథములను మాత్రమిట్లు ప్రౌఢిని జూప వ్రాసితిని గానీ తక్కినవన్నియూ సులభశైలిలోనే వ్రాసితి'' నని కూడా తెలిపినారు. ఇందుకు వారి 'సిద్ధయోగి చరిత్రము', సుజ్ఞాన ప్రబోధిని, నరసింహ నిరసనస్తుతి, శ్రీశైల మల్లేశ్వర శతకము, శ్రీ కేశవేంద్ర శతకము, వీరతిమ్మ మాంబా చరిత్రము (బుఱ్ఱకథ) ఇత్యాదులు ప్రబల నిదర్శనములై యున్నవి

సారంగధరీయము : "పూర్వం ఒకరిద్దరు ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాలను వ్రాసినవారున్నట్లుగా తెలియుచున్నది. ఆధునిక యుగంలో ఒక కాశీపత్యవధానులు తప్ప మరెవ్వరూ త్ర్యర్థి కావ్యాలను వ్రాయ లేదు" అని శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు కవిగారి జీవిత చరిత్రలో ఉద్ఘాటించారు. సారంగధరీయము మూడర్థాల కావ్యం. శివ, చంద్ర, సారంగధరుల కథలు జోడింపబడినవి. ఇది

సర్వజన సామాన్యమైన గ్రంథంకాదు. భిన్న సన్నివేశాలతో కూడిసది. శివకథలో సతి విచారం కావాలి, చంద్రకథలో యుద్ధం కావాలి, సారంగధర కథలో కాళ్ళు చేతులు నరుక బడాలి భిన్న భిన్న సన్ని వేశాలను ఏక సూత్రంలో నడిపించాలి. కవిగారు కావ్యనామంలోనే మూడర్థాలు సాధించారు. శివ, చంద్ర, సారంగధర కథలిందు గలవని తెలుపకయే తెలియునట్లు మూడర్థములు గల శబ్దమును చమత్కరించి "సారంగధరీయ" మని నామకరణము చేశారు అనియు, రామరాజ భూషణుడు తన హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు ప్రబంధరీతిని కొన్నివర్ణనములు వర్ణించియున్నాడు కానీ మిగతావారలుతమ ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములందు కథాభాగమును మాత్రము సమర్థించుకొని దాటినారు. ఈ కవియొ ఏకార్థ మహాప్రబంధరీతిని సారంగధరీయమునందు అష్టాదశ వర్ణనములగుపడునట్లు అతిమనోహరముగ ధ్వని, రస, భావ రంజితములగు నానాశ్లేషయుతములగు శబ్దార్థాలంకారములన్నింటిని తన గ్రంథములందగుపడునట్లుగ శిల్పచమత్కారము జూపినాడు అని నాటి గద్వాలాస్థాన విద్వాంసులగు శ్రీమాన్ పుల్లగుమ్మి వెంకటాచార్యులవారు సారంగధరీయమునకు వ్రాసిన పీఠికలో పేర్కొన్నారు. ఈ కావ్యం 1933 - 1934 సంవత్సరంలో వెలువడి ప్రతులు లభ్యంకాక ఉన్న సమయంలో దీనిని తెలుగు సాహిత్య అకాడమి వారు పునర్ముద్రణగావించి సాహితీలోకానికి మహోపకారం చేశారు. అయిననూ ఇంకనూ ఈ మహాకవి విరచిత ఇతర అద్భుత మహాకావ్యాలు మరుగున పడిపోకుండ చూడవలసిన ఆగత్యమున్నది

<u>నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యనము</u> : ఈ గ్రంథం 1930లో ముద్రింపబడి మరుగైపోయినది. దీనికే కవిగారికి కవిసింహ బిరుదము బహూకరింపబడినది. సంస్కృత పదసంబంధం లేకుండ కేవలం తెలుగు పదాలతో - ఆంధ్ర నామ సంగ్రహంలోనివి - అందులోనూ నిరోష్ఠ్య మగుటచే "ప ఫ బ భ మ వ" అరు అక్షరాలు పోగా మిగిలినవి చాలాకొద్ది పదాలతో కావ్యం వ్రాశారు. ఇది అపూర్వం అద్భుతం. ఇట్టి అచ్చతెనుగు కావ్యం పునర్ముద్రణం జరుగవలసిన ఆగత్యమెంతైనా కలదు. తొలి ముద్రణ అయి న ప్రతికి సమీపిస్తున్న ఈ అచ్చతెనుగు నిరోష్ఠ్య కావ్యం మలిముద్రణ అయినచో మరుగైపోయిన అనేక తెనుగు పదాలు వెలుగు చూడగలవనుట సత్యదూరంకాదు.

శ్రీశౌరిశైశవలీల : ఈ కావ్యం కవిగారి అపూర్వ సృష్టి. "య ర ల వ శ ష స హ ళ అ" అను పదే అక్షరాలతో కావ్యం. కథానాయకుడు శ్రీకృష్ణుడు - కృతికర్తపేరు కాశీపతి - కచటతపాది పంచ వర్గాలు లేవు. నిష్కేవలస్వర (అచ్చులులేవు. అచ్చుపదం వచ్చినప్పుడు దానిని యడాగమం చేసుకోవాలి) నిర్బిందు నిష్పంచవర్గ నిర్గద్య "దశాక్షరీయ కావ్యం" ఇది నిర్మాసిక కావ్యం. కావ్యమంతా ముక్కుమూసి చదువ వచ్చును - ఇట్టి అపూర్వ కావ్యం మరొకటి కనిపించుటలేదు. ఈ కావ్యం కవిగారి అసామాన్య ప్రతిభా పాండిత్యములకు నిదర్శనము.

త్రింశదర్థపద్యరత్నము ఇది కవిగారి అసాధారణ సృష్టి. "రెండర్థంబుల పద్యమొక్కటి వినిర్మింపంగ శక్యంబుగాకుండున్" అని సూరన యంతటివాడే అని యుండగా ముప్పది అర్థాలతో పద్యం వ్రాయడం సామాన్యమైన పనియా! దీనిని గుర్చించి "ఏకాక్షర నిఘంటువులలోని కొన్ని ప్రయోగార్హములుకాని వానిని గైకొని తికమకలు చేయక సుప్రసిద్ధ పదములతో సరళముగా పద్యము నడిపితిని" అని తమ విజ్ఞప్తిలో పలికిన ఈ మహాకవి పరిశ్రమను గుర్తించి ప్రశంసించని సాహితీ వేత్తలుందురా ! ఇది 1966 లో ముద్రితం. దీనిని కవిగారు కనకాభిషేకమునకు చిహ్నముగా శ్రీ ముద్దనూరి హనుమంతరెడ్డిగారికి అంకితమిచ్చినారు.

సిద్ధయోగి చరిత్రము : దీనిని పిల్లభాగవతమని కవిగారే అన్నారు. ఈ మహాకావ్యం వేదాంత గర్భితమై, సరళ పదాంవితమై సరసోక్తులతో నలరారుచు చదువుకొలది చదువవలెనను సత్కంఠను రేకెత్తించును. టంకసాల నృసింహ కవి "కవికర్ణ రసాయనము" ను జ్ఞప్తికి తెచ్చును. "సిద్ధయోగి చరిత్రచే గర్వ భంగమొనర్చి జోగుల జేతునపరసికుల" నని కవిగారన్న పలుకులతిశయోక్తులు కావని పాఠకులు గ్రహించగలరు- ఒక వంక కసరత్తుల కవిత్వమను చిత్రబంధ కవిత్వాలు వ్రాస్తూ మరొకవంక వేదాంతగ్రంథమైన సిద్ధయోగి చరిత్రను పరమ గంభీర భావ పరంపరలతో మధుర ప్రసన్న సన్నివేశాలతో రసవత్తర కావ్యంగా శిల్పించడం రససిద్ధుడైన ఈ మహాకవికే చెల్లును. గుర్తింపుగా ఈ మహాకావ్యం ప్రథమాశ్వాసమును ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు బి.ఎ. విద్యార్థులకు టెక్స్టుబుక్కుగా నియమించిరి.

శ్రీ నరసింహ నిరసనస్తుతి, సత్రశాల మల్లేశ్వర శతకము. (ఇందులో శైల బంధస్థ సీసపద్యములు, మత్తేభకంద గర్భిత సీసపద్యములు కలవు.) సుజ్ఞాన ప్రబోధిని, శ్రీ కేశవేంద్రశతకము (1932) శ్రీశైలమలేశ్వర శతకము, (శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారికి అంకితము) శ్రీ వీరతిమ్మ మాంబా చరిత్రము (బుర్రకథ) మున్నగు అరవైకిపైగా గ్రంథములు రచించినారు. ఇందుకొన్ని అలభ్యాలు కొన్ని అముద్రితాలు.

"కాశీపతి చమత్కృతి" వీరి చరమదశలో వ్రాసిన కావ్యం దీనిని వారి ప్రియశిష్యుడైన శ్రీరంగాపురం ఫోతేదార్ కేశవాచార్యగారికి అంకితం చేశారు. ఇదే ప్రస్తుత ముద్రిత గ్రంథము.

## కాఫీ దండకం

కవిసింహ కాశీపత్యవధానులుగారు ఆశువుగా చెప్పిన "కాఫీదండకం" నేటికిని బహుళ రసజ్ఞ జనావళిని ఆకర్షించుచున్నది - దానిని ఇందు పొందుపరుచనైనది. ఆ సందర్భమును శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు తాము వ్రాసిన కవిసింహ కాశీపతి జీవితచరిత్రలో ఇట్లా మనోహరంగా వర్ణించినారు చెన్నపురి ఆంధ్ర మహా సభలో అష్టావధానం జరుగవలసి ఉంది. కాశీపత్యవధానులుగారు చెన్నపట్టణం చేరుకొన్నారు. సరాసరి సభాస్థలికి వెళ్ళారు. సభా ప్రారంభమునకు కొంచెం ముందు సభానిర్వాహకులు కాశీపత్యవధానులుగారిని కాఫీ సేవించవలసిందిగా కోరారు. అందులకంగీకరించారు అవధానిగారు. అరకప్పు కాఫీ తీసుకొన్నారు. ఇంతలో సభాసదులందరూ వచ్చారు. కోలాహలం బయలుదేరింది, కాషాయాంబరధారీ, కర్ణకుండల సువర్ణ ఘంటా కరకంకణ కేయూరధారీ, గండపెండేర భూషిత పాదుడూ అయిన కవిసింహ కాశీపత్యవధానులుగారు అభినవ శ్రీనాధుడన్నట్లుగా సభావేదిక నలంకరించారు. చప్పట్లవర్షం కురిసింది. వెంటనే కాఫీనిగురించి ఆశువుగా దండకం చెప్పవలసిందిగా ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు అవధానిగారినికోరారు. కవిసింహ కాఫీదండకం ప్రారంభించారు

"శ్రీమన్మహాదేవి లోకేశ్వరీ కాళికా సన్నిభాకారిణీ లోకసంచారిణీ! అంబ కాఫీజగన్మోహినీ! తొల్లి శ్రీకృష్ణుడా స్వర్గమున్‌జేరి, పూతంబునౌ పారిజాతంబునున్ దెచ్చియున్. నాతికిన్ ప్రీతిగా నిచ్చుకాలంబు నందా సుమంబందు నంగల్లు భీజంబు లుర్వీస్థలిన్ రాలియున్, లోకభేదంబుచే( గాఫి భూజంబుగా( బుట్టియున్

గొమ్మలన్ రెమ్మలన్ బూవులన్ దావులన్ జిక్కనౌ పిందెలన్ జిక్కనౌ గాయలన్ జొక్కమౌ పండ్లభాసిల్లఁ దక్షిణాఫ్రికాజాలంబు, నైర్లండు నిగ్లాండు హాలెండు పోలెండు రష్యా జపాన్ జర్మనీ గ్రీకు దేశంబులన్నాటి, పెన్ప్రమాకులై ఇండియాన్ దోట్లలై వి త్తనాలిచ్చుచున్నావటంచున్ మదిన్ దోచెడిన్ బాపురే! తీపిలో నీరమున్ క్షీరమున్ జక్కరన్ మించుటన్గాదె, నీ బీజ చూర్ణంబు నా మూటిలోఁజేర్చి సేవించుటన్, నీదు బీజంబులన్ బెంచులోమాఁడ్చి చూర్ణంబుఁగా వించినన్ దీపిపోదాయె, నీ మాధురీశక్తి నీయింపు నీ సొంపు నీ పెంపు వర్ణింప నేనెంతవాఁడన్, ధనాకర్షిణీ ప్రాణసంరక్షిణీ! ధాత్రినెవ్వారలేన్ వేకువన్ లేచియున్ నిత్యకృత్యంబులన్దీర్చి, మున్ముందుగా నిన్ను సేవింపకే కార్యమున్ సేయగా లేరదెట్లందువా నిన్ను పానంబుఁగావింపకున్నన్ ద్విజుల్ వేద మంత్రంబులన్ బల్కగాలేరు, ప్రాంచత్కవుల్ పద్యముల్ హృద్యమౌరీతి నిర్మింపఁగాలేరు, శ్రావ్యంబుగా శౌరిదాసుల్ గళంబెత్తియున్ బాడి నృత్యంబులన్ సేయఁగాలేరు, శిల్పుల్ మనస్ఫూర్తిగా సుత్తి జేపట్టగాలేరు, వైశ్యోత్తముల్ కొట్లతాళంబులన్ దీయఁగాలేరు. డ్రైవర్లు మోటార్ల స్టీరింగులన్ బట్టఁగాలేరు, టీచర్లుపాఠంబులన్ జెప్పఁగాలేరు, డాక్టర్లు నింజక్షనుల్ జేయఁగాలేరు, ప్లీడర్లు నోరెత్తి వాదింపగాలేరు. జడ్జీలు నేస్వల్పమౌ తీర్పులన్ వ్రాయఁగాలేరు. దిట్టంబుగాఁబాలసుల్ కూటసాక్ష్యంబులన్ జెప్పగాలేరు. వారాంగనల్ కోటికాంక్షన్ వెసన్గేళిలో నోలలాడింపగాలేరు, ముప్పూటలన్ నిన్నొగిన్ గ్రోలకున్నన్ శిరోభారమై నాల్కయెండున్, మనంబెంతొ చాంచల్యమున్ బొందుచున్గుండియల్ తల్లడం బందుచున్ మేను కంపిచుఁగాదే! కటాక్షంబుతో నిత్యమున్ వేళకున్ దర్శనంబిచ్చి, నిన్ బాగుగాఁద్రాగు సౌభాగ్యమున్ గూర్చి, రక్షింపవే! సారెకున్ గొల్చెదన్ విశ్వకర్మాన్వయంబందునన్ సత్కవీంద్రుండనన్ జెల్లు పోకూరి కాశీపతి స్వాంతరాజీవసంవాసినీ! నీకికన్ మంగళంబౌ మహాకాఫిదేవీ! నమస్తే నమస్తే నమస్తేనమః॥"

ఝరీ సదృశమైన వేగంతో దండకం అశువుగా చెపుతూవున్న కాశీపత్యవధానులుగారు సభాసదులకు "పుంభావ సరస్వతి" అనిపించారు. దండకం సమాప్తంకాగానే సభాభవనం కరతాళధ్వనులతో ప్రతిధ్వనించింది.

— ○ —